


రామకృష్ణ - ఎన్.ఏ.టి కంబైన్స్ వారి

# శ్రీకృష్ణపాండవీయం

చిత్రానువాదం, దర్శకత్వం: యన్.టి.రామారావు B.A. నిర్మాత: త్రివిక్రమరావు

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దాని రచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనన్నీ, దేనికీ అనుకరణ కాదన్నీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీ లేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# స్వల్ప ఖర్చుతో హెచ్చు ఉత్పత్తి

టాటా స్టీల్ కర్మాగారములోని అతి అధికమైన క్రాష్టిములు (Blast Furnaces) ప్రతి కొద్ది సంవత్సరములకు బాగుచేయవలయును. ఈ పనిని ఉక్కు పనివాండ్రు అంతర పటలములను మార్చుట (Relining) అందురు. ఇది చాల కష్టమైన పని. ఈ పనికి వేలకొలది టన్నుల ఉష్ణ నిరోధక యిటుకలు, ఉక్కు, ఇనుప రేకులు అనేక మైళ్ళ పొడవైన ఎలక్ట్రిక్ తీగెలు మరియు గొట్టములు అవసరము. నిపుణులైన ఇంజనీర్లు, పనివాండ్రు కూడా అవసరము. అడుగడుగునకు ఈ పని యొక్క ప్రతి వివరము ముందుగా ఆలోచించి తరువాత చర్యతీసుకొనబడును. ఇంజనీర్లు, పనివాండ్రు కలసి రాత్రింబవళ్ళు గడియారమువలె క్రమపడి ఈ పనిని అతి తక్కువ కాలములో స్వల్ప ఖర్చుతో పూర్తి చేయుదురు.

అనేక సంవత్సరములనుండి ఈ పనిలో టాటా స్టీల్ వారి అనుభవము అభివృద్ధి చెందినది. 1957 లో అధిధమన క్రాష్ట్రియొక్క అంతర పటలములను మార్చుటకు 90 దినములు పట్టెను. 1963 ఆరంభములో ఈ పనిని 74 దినములలో పూర్తిచేసి అమోఘమైన రికార్డును నెలకొల్పిరి. కాని 6 నెలలలోనే అదే పనిని 64 దినములలో ముగించిరి.

కాని, ఇంతటితో ఈ అభివృద్ధి అంతము కాలేదు. ఏ అంతర పటలములను మార్చుటకు 1957 లో 90 దినములు పట్టెనో ఇప్పుడు ఆ పనిని 57 దినములలో చేసిరి. ఈ విధముగా మిగిల్చిన కాలమును అత్యావశ్యకమైన ఉక్కును ఉత్పత్తి చేయుటకు వినియోగించుదురు.

వీలగునంత తక్కువ కాలపరిమితిలో పనులను మనస్ఫూర్తిగా, ఎడతెగని యత్నముతో చేయుట మరియు తదితరమైన రికార్డును నెలకొల్పుటలో కంపెనీవారి లక్ష్యము ఖర్చులను తగ్గించుట, ఉత్పత్తిని హెచ్చించుట.



టాటా స్టీల్

The Tata Iron and Steel Company Limited

SWTTN 2834

## పాఠకులకు మనవి

1—1—1966 నుంచి ఆంధ్ర పత్రిక దినపత్రిక, ఆదివారం పత్రికల ధరలు 10, 15 పైసలుగాను, ఆంధ్ర సచిత్ర వారపత్రిక 35 పైసలుగాను మార్పటం జరిగింది. కొత్త చందారేట్లు కూడా తదనుగుణంగా మారుతాయి. ఈ క్రింద, ఇంతకు ముందే ప్రచురించిన పోస్టల్ చందా రేట్లే కాక, ఏజంట్లవద్ద పత్రికలు తీసుకునే చందాదారులకు వర్తించే చందా మొత్తములను కూడా సూచిస్తున్నాము.

### ఆంధ్రపత్రిక దినపత్రిక

| | ఏజంటుద్వారా రూ. పై. | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|---|
| ఒక సంవత్సరం | 38—00 | 46—00 |
| ఆరు మాసాలు | 19—00 | 23—00 |
| మూడు మాసాలు | 9—50 | 11—50 |
| ఒక మాసం | 3—25 | 3—85 |

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**14—1—66 నుండి**

| | | |
|---|---|---|
| ఒక సంవత్సరం | 18—20 | 19—25 |
| ఆరు మాసాలు | 9—10 | 9—62 |
| మూడు మాసాలు | 4—55 | 4—80 |

ఆంధ్రపత్రిక, ఆంధ్రసచిత్ర వార పత్రిక అభిమానులు ఎప్పటివలె మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

మేనేజర్,
ఆంధ్రపత్రిక.

# ఉత్తరాలు

### ఫిలిం బాలట్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక, సంక్రాంతి ప్రత్యేక సంచికలో పాఠకులకు 'ఫిలిం బాలట్' విషయమున మీ లోక దుర్బోధన గావించి నందుకు చాల విచారిస్తున్నాను. 'ఫిలిం బాలట్' ప్రక్కన 'మీ అభిమానులను ఎన్నుకోండి' అని పెద్ద పెద్ద అక్షరాలతో ప్రచురించారు. అంటే తమ తమ అభిమానులు 1965 చిత్రాలలో తమ నైపుణ్యం ఉత్తమంగా ప్రదర్శించక పోయినా వారినే ఆ సంవత్సరానికి ఉత్తములుగా పాఠకులు ఎన్నుకున్నా తప్పులేదని మీరు హామీ ఇవ్వారన్నమాట. ఛ్ఛ ! న్యాయంగా ఎన్నుకోమని చెప్పవలసిన మీరే ఇలా దుర్బోధన చేయడం ఎంతైనా శోచనీయం. ఉత్తమ నటీ నటులను, సంగీత దర్శకుని, దర్శకుని ఎన్ను కోవడంలో ఎవరెవరు తమ తమ విద్యలలో బాగా రాణించగలిగారో గమనించి ఎన్నుకో వలసిందే గాని, అందులో మన 'అభిమానికి', వారి 'ఉత్తమ గుణాలకు' తావీయరాదు.

జి. జయప్రకాష్ (బమ్మలమడుగు)

### సినిమా

14—1—65 సంచిక సినిమారంగం శీర్షిక క్రింద 1965 లో మంచి చిత్రాలు లేవన్నారు. గొప్పగా చెప్పుకోదగినన్ని ప్రజా దరణపొందిన చిత్రాలు ఎక్కువగా లేవన్నారు. 'పాండవ వనవాసం', 'నాడీ ఆడజన్మే', 'శీలాభిమన్యు' వగైరా ప్రజాదరణ పొందాయి. ఇక పోతే ఏటికెదురీత, సుమంగళి, అంతస్తులు, దేవత, అక్కచెల్లెళ్ళు, కన్నెపిల్ల లాంటి మంచి చిత్రాలున్నాయి. మిగతావి కూడ విడుగు—బోడుగులేవి అంటే ఒక నిర్దిష్ట అభిప్రాయాలంటూ లేని తెలుగు అభిమానులకు బాగున్నా కూడ నచ్చలేదు. మొత్తం 11 చిత్రాలు మంచివున్నా కూడ ధర్మాజీ అభిప్రాయ వ్యక్తీకరణ బాగాలేదు. తెలుగు చిత్రరంగాన్ని గురించి, బాగున్నా కూడ ముఖ్య పత్రికలలో ఇలా వ్రాయడం బాగాలేదేమో ననిపిస్తుంది.

బి. జయరాం చౌదరి (బళ్లారి)

### కార్టూన్

సాధారణంగా బాపు బొమ్మలు చాలా ముద్దొస్తాయి. కానీ, సంక్రాంతి సంచిక ముఖచిత్రంలోని పాపాయిని తప్పిస్తే, ఇతర పేజీల ముఖాలు బాపు బొమ్మలలా లేవు.

మొత్తానికి కవర్ డిజైన్ చాలా బాగుంది.

వి. శంకర్‌రావ్ (మునాబాబా)

### కథలు

రచయిత అనురశ్రీగారు వ్రాసిన "అతివిలో మనిషి" అనే కథానిక ఎంతో ఉత్సాహంగాను, ఆవేశాలతోను ఆనందాన్ని, జీవితంలో కొన్ని సత్యాల్ని విశదం చేసింది. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

కోటబంతు గోపాలరావు (భాగ్యనగర్)

* * *

కథా కథనంలో క్రొత్తదనం ఉంటేనే గానీ రచయిత పేరులోకిరాడు. ఆ కథలు జ్ఞాపక ముండవని శ్రీరంగం రాజేశ్వరరావు గారి "దేవుడినవ్వు" చదివినతరువాత మాకు అనిపించింది. అలంకార సమ్మిళితమైన హాస్యంతో "దేవుడి నవ్వు" ని కనిపింప జేసిన రచయితకి మా అభినందనలు. ఇలాటి కథలకై నిరీక్షిస్తూ—

వనంపూడి బాలకిష్ణారావు, ఆచార్య తిరుమల (ఏలూరు)

### సీరియల్

'పసిడి మనసులు' సీరియల్ మొదటి నుండి ఎంతో ఉత్సాహంతో చదివాము. కాని మేము మరోక విధంగా ఆశించాము. 'సిస్టర్స్' ఇద్దరిని 'ఫ్రెండ్స్' చేసుకున్ని, రోహిణిని వదిలేస్తారేమో అనుకున్నాము. కాని అలా కాకుండ రచయిత 'రజని'కి పెద్దరికాన్నిచ్చి కథలో మలుపు త్రిప్పారు. నవల చాలా బాగుంది. రచయితకు పత్రిక ద్వారా మా హృదయ పూర్వక అభినందనములు.

త్వరలో 'జయంతి'తో మరోక మంచి సీరియల్ మొదలెడతారని ఎదురు చూస్తున్నాము.

మునిస్వామి పద్మ, లక్ష్మి (జనగామపేట)

* * *

"పసిడి మనసులు" నాతన సంతలో ఉదాత్తంగా నడిచిందని చెప్పాలి. "రజని" పాత్రను మొదటి నుండి కూడారయంత్ర ఉదాత్తంగా చిత్రించారు. కథావిధానం చివరిభాగంలో సహజంగా తయారై ముగింపు "రజని" పాత్రను విశిష్టమైన పాత్రగా సృష్టించుటవల్ల ఉదాత్తంగా రచన నిలిచింది. రచయిత హరికిషన్‌కు ధన్యవాదములు.

తా. వెం. రంగారావు (విజయవాడ)

### వ్యాసం

12—11—65 ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని 'ఉపవాసాల' వ్యాసంలో ఇచ్చిన సంఖ్యలు ఎక్కడి నుంచి సేకరించినవని విజయవాడ పాఠకుడు ఒకరు రాశారు. ఇండియా '1964' అనే, ప్రభుత్వం ప్రకటించిన పుస్తకంలోనివని ఆ వ్యాసం చివరనే రేశాము. ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 21—1—'66

విశ్వావసునామ సం॥ పుష్య మాసం బహుళ అమావాస్య

సంపుటము : 58 సంచిక : 21

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా<br>రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 2.25 |

# మనలో మాట

మే, 1964 లో జవహర్‌లాల్ నెహ్రూ చనిపోయినప్పుడు ఆయన 'వారసుడు' ఎవరు అవుతారో అన్న విషయమయి నిజానికి అంత సందేహం అందరిలోనూ కలుగలేదేమో; కాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి తమ స్థానానికి ఏంత న్యాయం చేకూరుస్తారన్న సందేహం మాత్రం ఎందరికో కలిగింది. తాము ప్రధానమంత్రి పదవిని అలంకరించిన 19 నెలలోనూ ఆయన ఈ సందేహాన్ని చక్కగా నివృత్తిచేశారు. పరిపాలనా భారాన్ని సక్రమంగా భరించటమేకాక, పాకిస్తాన్ దురాక్రమణ, చైనా బెదిరింపులవల్ల మరింత చెడిన ఆర్థిక పరిస్థితిని వీలయినంతదాకా సరిదిద్దటానికి తగిన ప్రయత్నాలుచేస్తూ, యుద్ధసమయంలో సరయిన నిర్ణయాలు తీసుకుని అశేష జనాదరణాన్నిపొందిన లాల్‌బహదూర్ శాస్త్రి తను నిజంగా రాజకీయవేత్త అనిపించుకున్నారు. పరస్పర విరుద్ధంగా ఉండే వర్గాలవారికి మధ్య వర్తిత్వం వహించి, అందరికీ నచ్చే పరిష్కారాలు చెయ్యటమే రాజకీయవేత్తల ధర్మం అన్నాడొక గొప్ప బ్రిటిష్ తత్వశాస్త్రజ్ఞుడు. భారత ప్రధానమంత్రిగా లాల్‌బహదూర్ శాస్త్రి ఈ ధర్మాన్ని బాగా నిర్వర్తించారని ఒప్పుకొనక తప్పదు. మహానాయకులు, యుగపురుషులు తీసుకువచ్చే 'విప్లవాల' ధాటిని కొంత తగ్గించే మామూలు నాయకులు కూడా కొన్ని సమయాలలో అవసరం అవుతారు. తాష్కెంట్‌లో, రష్యన్ ప్రధాని అధ్వర్యం క్రింద శాంతికోసం లాల్‌బహదూర్ శాస్త్రి చేసిన కృషి ఆయన సాధించినదానికంతా చిహ్నం.

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

## విషయానుక్రమణిక

# జోహార్, లాల్ బహదూర్!

లాల్ బహదూర్! లాల్ బహదూర్!
ఇదిగో, వెచ్చని జోహార్!

గుగన నిండే ధైర్యం
నీ రూపం దాల్చిందట.
పిడుగుపడ్డ ఈ దేశం
నీ చలవన బ్రతికిందట,
ఒళ్లు పొంగి 'శాంతివనం'
నా రమ్మని పిలిచిందట.
లాల్ బహదూర్! లాల్ బహదూర్!
ఇదిగో, వెచ్చని జోహార్!

జాతిని నిర్మించేందుకు,
శాంతిని వెలిగించేందుకు,
జీవితమే వెచ్చించిన
యుగపురుషుని వారసునిగా—

కల్లోలం, కాపట్యం,
యుద్ధాగ్నులు, రక్తాశ్రులు,
ఆకలి వ్యధ, చీకట్లూ
ముప్పిరిగొని ముంచెత్తిన
మూగ కోటి గొంతుల్లో—

"జై జవాన్! జై కిసాన్!"
అన్న సింహగర్జనతో
ఇంతింతై, మరి అంతై,
అంతంతై అగ్గలించి,
దేశానికి రక్ష కట్టి,
దాస్యానికి శిక్ష వేసి, చరిత్రనే సవరించావ్!
విశ్వమే నిలబెట్టావ్!
లాల్ బహదూర్! లాల్ బహదూర్!
ఇదిగో, వెచ్చని జోహార్!

ధర్మానికి జామీనుగా
శుర ఫిరంగి మోగించి,
పరహింసకు కరగిపోయి
కన్నీరే నిండించి,
'తాష్కెంటు'కు దారితీసి
గౌరవాల కలం దూసి
శాంతి పిలుపునామాకై
సాక్షి సంతకంచేసి,
మనస్సు మాత్రం మాకిచ్చావ్,
వయస్సు మాత్రం జమకట్టావ్!
లాల్ బహదూర్! లాల్ బహదూర్!
ఇదిగో, వెచ్చని జోహార్!

నిరీక్షలో, పరీక్షలో
విప్లవాల కుంపటిగా మారిన
వర్తమాన జీవితాన్ని
వరించుకున్న మాకు –

సామాన్యుడి ప్రతినిధిగా,
వెనుదిరుగని వీరుడిగా,
మనోబలాల మేరువుగా,
క్రియాచరణ శిఖరంగా,

నువు చూపిన కర్తవ్యాన్ని
నువు లేపిన క్షాత్రవ్యం,

చితాభస్మ రివాజంగా,
స్మరణాల దీపంగా
ప్రసాదించి పోవయ్యా!
అదే మాకు ఋణమయ్యా!
లాల్ బహదూర్! లాల్ బహదూర్!
ఇదిగో, వెచ్చని జోహార్!

—జగ్గయ్య



తాష్కెంట్ విమానాశ్రయంలో 'శవవాహకులు' అయూబ్, కోసిగిన్ తదితరులు.

# శ్రీ శాస్త్రి కన్నుమూత

భారత్, పాకిస్తాన్ దేశాలమధ్య శాంతి నెలకొల్పాలని, సఖ్యతను సాధించాలని తాష్కెంట్‌వెళ్ళి, ఉభయులకూ అంగీకారమైన ఒప్పందం ఒక దానిమీద సోమవారంనాడే సంతకాలు చేసి, మంగళవారంనాటి ఉదయానికల్లా దేశానికి తిరిగివస్తారనుకొన్న మహనీయుడు తిరిగి రాలేదు. మంగళవారం తెల్లవారుతుండగానే భారత ప్రధాని శ్రీ శాస్త్రి తాష్కెంట్‌లోనే పరమపదించారన్న వార్త వీధివీధికీ ప్రాకిపోయింది.

ప్రధాని శ్రీ నెహ్రూ మరణానంతరం, 18 నెలల పరిపాలనాకాలంలో ఆయనకు తగిన వారసుడనిపించుకొన్న శ్రీ శాస్త్రి దేశ అత్యయిక పరిస్థితిలో మరణించటం—అందునా, మరో గడ్డమీద తనువు చాలించటం— దురదృష్టకరం.

సోమవారం నాటికే తాష్కెంట్ సమావేశం సమాప్తమయింది. తదనంతరం సోవియెట్ ప్రధాని శ్రీ కోసిగిన్ చేసిన విందులో శ్రీ శాస్త్రి పాల్గొన్నారు. విందు కాగానే, రాత్రి పది గంటలకు భారత ప్రధాని తాష్కెంట్‌లోని తన విడిదికి చేరుకొన్నారు. పదకొండు గంటలకు పరున్నారు. తెల్లవారుజామున ఒకటి ఇరవైకీ ఆయనకు దగ్గుతెర ఒకటి వచ్చింది. కొద్ది క్షణాల్లోనే— శ్రీ శాస్త్రి స్వంత వైద్యులు వచ్చినప్పటికీ— ప్రయోజనం లేకపోయింది..... సోవియెట్ వైద్య నిపుణులు కూడా హుటాహుటిన వచ్చి గుండె తిరిగి పని చేసేందుకు ప్రయత్నాలు చేశారు కాని, అప్పటికే అంతా మించిపోయింది..... ప్రపంచంలోకెల్లా పెద్దదైన ప్రజాస్వామ్య దేశానికి ప్రధాని, ఒకటిన్నర గంటలకు శాశ్వతంగా కన్ను మూశారు.

ఇది విన్న సోవియెట్ ప్రధాని శ్రీ కోసిగిన్ మరుక్షణంలోనే అక్కడికి వచ్చారు. శ్రీ శాస్త్రి భౌతికకాయాన్ని చూచిన కోసిగిన్ నిశ్చేష్టులైపోయారు. ఆయన కనులవెంట బొటబొటా నీళ్ళు రాలాయి.



# ప్రజల నాయకుడు

కొన్ని దేశవాళీ పద్ధతులని బలవంతంగా అలవాటు చేసుకోనక్కరలేని భారత రాజకీయ నాయకులలో శ్రీ కామరాజ్ ఒకరు. విరుధనగర్ మునిసిపల్ ఎన్నికలతో ప్రారంభించి భారతదేశానికి ఎవరు ప్రధానమంత్రి అవాలో నిర్ణయించగలిగినవారిలో ముఖ్యులు కాగలిగినా ఆయన వాలకంలో పెద్ద మార్పు లేవీ వచ్చినట్లు కనిపించవు. అదే నిరాడంబర వైఖరి, తక్కువ ప్రసంగం ఇంకా గమనించవచ్చు. ఇంగ్లీషు కులానికి చెందినవారుకారని జవహర్‌లాల్ నెహ్రూ ప్రశంసించిన శ్రీ కామరాజ్ ఒక విధంగాచూస్తే సిసలయిన 'ప్రజా నాయకుడు.' కాని ఆయన నిరాడంబర వైఖరి వెనుక దాగి ఉన్న రాజకీయ నైపుణ్యం ఇప్పుడు బయటపడిన సత్యంకాదు. మద్రాసులోఆయన 'కింగ్ మేకర్'గా ఎప్పుడో కీర్తిసంపాదించుకున్నారు. కుమారస్వామి రాజా, ఓమాండూర్ రామస్వామి రెడ్డియార్, సి. రాజగోపాలాచారి వరసగా ముఖ్యమంత్రులయి తర్వాత తప్పుకోవలసి రావటమే ఈ కీర్తికి కారణం అని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఆంధ్ర ప్రాంతాలలో కాంగ్రెసుపార్టీ దెబ్బ తిన్నప్పుడు శాసన సభలో ప్రతిపక్షం వారిని అరికట్టేందుకుమాత్రం శ్రీ రాజగోపాలాచారిగారిని తీసుకురావలసి వచ్చినా సమయం వచ్చేసరికి ఆయననీ పంపించి వెయ్యటం జరిగింది. ఆ తర్వాత శ్రీ కామరాజ్ స్వయంగా ముఖ్యమంత్రి పదవిని చాలా కాలం అలంకరించారు. ఆయన పాలనలో మద్రాసురాష్ట్రం ఎంతోముందుకు సాగింది. ఇది చాలావరకూ దేశ ప్రజల కృషిమీద ఆధారపడినదేకాని రాజకీయ



భారతప్రధానికి, కాంగ్రెస్ ప్రధాని అభినందనలు.

ధానాలు కూడా తోడ్పడ్డాయన ంలో సందేహంలేదు. 1962 ఎన్ని ల తర్వాత ఏర్పరచిన మంత్రివర్గా లోకెల్లా చిన్నది మద్రాసు మంత్రి ర్గం! ఇదీ శ్రీ కామరాజు రాజకీయ పుణ్యానికి తార్కాణం. ఇంతేకాక, ామరాజు పథకం' కింద రాజీనామా చేసి, శ్రీ భక్తవత్సలమే ముఖ్యమంత్రి కావాలనుకున్న వర్గాన్నే బలపరచటం ఈ నైపుణ్యానికి మరొక తార్కాణం.

రాజకీయాలలో—తక్కిన విషయాలలో వలెనే—ఏది ధర్మమయిన పద్ధతో ఏది కాదో చెప్పటం కష్టం. 1964లో 'కాన్సెన్సస్' యుక్తితో లాల్‌బహదూర్‌శాస్త్రిని ప్రధానమంత్రి చేసినప్పుడు శ్రీ కామరాజ్ అవాంఛనీయమయిన పద్ధతిని అవలంబించారని ఎందరో అన్నారు. అందరినీ హడావుడి పెట్టి సరయిన నిర్ణయం రాకుండా చూశారని ఆరోపించారు. ఇది ఎంతదాకా నిజమో చెప్పటం కష్టంకాని 1966లో 'ఏకగ్రీవంగా' ఎన్నిక జరగాలని పట్టుపట్టినవారి ప్రయత్నాలు విఫలం అయ్యాయి. అయినా శ్రీ కామరాజ్ వెనక్కి తగ్గలేదు. రాష్ట్ర ముఖ్యమంత్రుల, పి. పి. సి. అలా తను అభ్యర్థిగా నిలబెట్టిన శ్రీమతి గాంధీని సుమారు 68 శాతం వోట్లతో గెలిపించారు. శ్రీమతి గాంధీది మంచి గెలుపే, ఆమెకి ఎదురుగా వోట్లు వేసినవారి ధైర్యాన్ని కొంత దాకా మెచ్చుకోవలసినదే—కాని మామూలుగా పాటించే రాజకీయ పక్షాల ఎన్నిక నిబంధనలని ఈవిధంగా పక్కకితోసి వెయ్యటంవల్ల ఏర్పడటానికి అవకాశం ఉండే పరిణామాలు ఎటువంటివి అయి ఉంటాయి? ఎంత, 'రాజకీయాలేకదా' అనుకున్నప్పటికీ కొన్ని 'సభ్యత'లని పాటించకపోవటంవల్ల పార్టీ 'ఆరోగ్యం' చెడే అవకాశం ఉంటుందా? ఈ ప్రశ్నలు ఎందరో అడుగుతున్నారు. రాబోయే ఎన్నికల టిక్కెట్ల పంపిణీలు, ఎన్నికలలోని ఫలితాలు ఈ ప్రశ్నలకి సరయిన సమాధానం ఇవ్వవచ్చు. ఇంతలోపల మద్రాసురాష్ట్రంలో జరిగినట్లే అడ్డంగా నిలబెట్టిన వ్యక్తి తప్పుకోవలసి వచ్చినప్పుడుఅసలు మనిషి అధికారం స్వీకరించడమూ జరగవచ్చు. లాల్‌బహదూర్ శాస్త్రి పోగానే శ్రీ కామరాజ్ విమానంఎక్కి ఢిల్లీ వెళ్లారు. దారిలో "ఏంచెయ్యా కూడా అనేకాలని ఒక పత్రిక ప్రచురించింది. ఈ కథ నిజమయినా కాకపోయినా చివరి చివరిదాకా జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె శ్రీమతిఇందిరా గాంధిని శ్రీ మొరార్జిదేశాయ్‌కి ప్రత్యర్థిగా నిలబెట్టాలనే యుక్తి ఎవరికీ తట్టలేదనిమాత్రం అనిపిస్తుంది. ఎవరి వోట్లవల్లనైతే అంత పెద్ద మెజారిటీతో శ్రీమతి గాంధి పార్టీ నాయకురాలిగా ఎన్నిక అయ్యారో ఆ రాష్ట్రాల నాయకుల మధ్య, 'ఎవరిని మొరార్జికి ఎదురుగా పోటీ చేయించా'లనే విషయమయి వెంటనే ఒక స్థిరమయిన అభిప్రాయం కలగలేదని వార్తా పత్రికలలో పడిన వార్తలనిపట్టి ఊహించవచ్చు. బలంగా కనిపించే అయికమత్యం వెనుక ఏన్నో చీలికలు దాగి ఉండవచ్చు. వీటినీ, పార్టీలోపలేఉన్న ప్రతికూల శక్తులనీ చక్కబెట్టి అందరికీ నచ్చచెప్ప పోతే పాశ్చాత్య దేశాలవద్దనుంచి మనం కష్టపడి తెచ్చుకున్న ప్రజాస్వామ్య సంస్థలకే ముప్పు రావచ్చు. ఈ ప్రమాదాన్ని గుర్తించి జాగ్రత్తపడే బాధ్యత అందరితోబాటు శ్రీ కామరాజ్‌కి ఉంది




అన్నయ్యనూ నన్నూ ఒకేసారి చూస్తే మే మిద్దరం అన్నదమ్ములమని ఎవరైనా ఇట్టే తేలిగ్గా చెప్పగలిగేవారు. కాని ఓ మూడు రోజులు మా ఇద్దరితోనూ కలిసి తిరిగితే, మే మిద్దరం అన్నదమ్ములమేనా అని వాళ్లకే సందేహం వచ్చేది!

అన్నయ్య చాలా మంచివాడనీ, నేను వాడికి వ్యతిరేక పదార్థాన్ననీ చెప్పుకునేవారు కొందరు! అన్నయ్యలా ప్రవర్తించడానికి ప్రయత్నించమని, నాకు సలహా ఇచ్చేవారు మరికొందరు! 'అది మాత్రం నావల్ల కాదు, క్షమించండి!' అనే మాటమే అలవాటయింది కానీ, అన్నయ్యలా మంచిపేరు తెచ్చుకుందామని ఎప్పుడూ అనిపించేది కాదు. అసలీ సొసైటీ అంటేనే నాకు పరమ అసహ్యం. ముఖ్యంగా, మావూరువాళ్లన్నా, మా బంధువులన్నా నాకు ప్రత్యేకమయిన చికాకు. వాళ్లనేమాటలు నే నెప్పుడూ లెక్కచేయలేదు— నా వ్యక్తిత్వం నాది. నా హాబీలు నాకున్నాయి. నా స్నేహితులు నాకున్నారు. నా కిష్టమయిన పనులు నేను చేస్తాను. ఎవళ్లో, ఏదో అనుకుంటారనీ, అంటారనీ, నే చేయదలచుకున్న పనులు నే నెప్పుడూ మానలేదు! అలాగే, ఎవళ్ల మెప్పో పొందాలని నా కిష్టంకాని పనులు చేయనూలేదు! అయితే అన్నయ్య విషయము అలా కాదు! చెడ్డపేరంటే జంకుతాడు. ఎవరైనా తన గురించి కొంచెం చెడ్డగా చెప్పుకున్నారని తెలిస్తే చాలు తెగ బాధపడిపోతాడు. అక్కడే మా యిద్దరికీ బాగా తేడా కనుపిస్తుంది.

"నీ వ్యక్తిత్వం గురించి నువ్వు ఆలోచించుకోవేమిరా?" అని అడిగేవాణ్ణి అన్నయ్యని.

"మనిషిగా బ్రతికి మంచిపేరు తెచ్చుకోకపోతే, ఇంక మనం బ్రతకడ మెందుకురా?" అనేవా డన్నయ్య.

ఇంతకూ నేను మాట్లాడేది ఓ మూడేళ్ల క్రిందటి మాట! ఇప్పటి పరిస్థితి గురించి తర్వాత చెప్తాను.

మా యిద్దరి మధ్యా అంత తేడా ఎందుకు ఉండేదో, ఈ క్రింది విషయాలు చదివితే, మీకే తెలుస్తుంది.

మేం పుట్టింది తూర్పు గోదావరి జిల్లాలోని ఓ పల్లెటూళ్లో! మా నాన్నగారు పూర్వకాలపు బియ్యే చదువుకుని కొంతకాలం రాజకీయాల్లో పనిచేసి, తర్వాత వ్యవసాయంలోకి దిగిపోయారు. క్రొత్త అనుభవాలంటే ఆయన కిష్టం. అందుకే మమ్మల్ని ఆయనకు చాలా దూరంగా ఉంచే చదివించారు. ఆరేళ్లొచ్చాయనేసరికి అన్నయ్యని మద్రాసు పంపించేశారు, పెదనాన్నగారి ఆధ్వర్యంలో ఓ కాన్వెంటు స్కూల్లో చదివించడానికి. అలాగే నన్ను ఆరేళ్లు నిండకుండానే బొంబాయి తోలేశారు పెద్దమ్మగారింట్లో ఉంచి అక్కడ 'ఆంధ్రా సొసైటీ' వాళ్ల స్కూల్లో చదివించటానికి.

ఏడాదికోసారి మాత్రం మమ్మల్నిద్దర్నీ మావూరు రప్పించుకునేవారు. సమంగా వేసవి సెలవల్లో నెల్లాళ్లు మావూళ్లో గడప నిచ్చేవారు. వెంటనే మా యిద్దర్నీ చెరో వైపుకీ పంపించేసేవారు—పాపం, మా అమ్మ కన్నీళ్లు నాన్నగార్ని ఏమాత్రం కరిగించలేకపోయెవి.

చిన్నప్పటిరోజు లెలా జరిగిపోయాయో జరిగిపోయాయి! నాక సమంగా పదహారేళ్ళు వచ్చిం దగ్గర్నుంచీ జరిగిన విషయాలన్నీ బాగా గుర్తున్నాయి. మావూరు ఓ చిన్న పట్టణంగా తయారయింది. హైస్కూలు, తారోడ్డు మొదలైనవన్నీ వచ్చేశాయి. బొంబాయి నుంచి నేను, మదరాసు నుంచి అన్నయ్యా వేసవి సెలవులకి అక్కడికి వెళ్తే మాకు కాలక్షేపానికి కావలసినవన్నీ ఉండేవి. వూళ్లోవాళ్లందరూ మమ్మల్ని కొంచెం వింతగానే చూసేవారు. వచ్చిననాడో, ఆ మర్నాడో మా చుట్టా లందరిళ్లకీ వెళ్లి కనుపించి వచ్చేవా డన్నయ్య. నన్ను తన కూడా రమ్మనేవాడు. అక్కడె మా యిద్దరికి



# తప్పు చేసాను

రిక్కుండి వేణుగోపాలరావు

ప్రమోషన్‌మీద ఆ వూరు వెళ్ళడం అదే మొదటిసారి. మా ఆఫీసువాళ్ళు అంతకు ముందే ఇల్లు చూసివుంచడంతో నాకేం ఇబ్బంది ఉండదనుకుంటూనే వస్తున్నాను. బండిలో స్టేషన్‌నుంచి.బండిని తోలే వెంకన్నే నా ఆఫీసుకు వ్యాను. ఈ విషయం రైలు దిగగానే ఆఫీసువాళ్ళు చెప్పారు. కంకరరోడ్డు మీద పోలేక పోలేక బండి పోతుంటె ప్రక్కలకు తలకొట్టుకోగానే, చిన్నప్పుడు కోటప్ప కొండ తిరణాలకు వెళ్ళినప్పుడు రోజులు జ్ఞాపకం వస్తున్నాయి, "బండ్లోంచి సామా నేమైన పడిపోద్దేమో, కాస్త కన్నేసుండండి బాబు" అంటున్న వెంకన్న మాటలు వినగానే. "ఇంకెంత దూరం.....రా!" అనే ప్రశ్న వినక ముందే "ఇంకెంతదూరం బాబూ! అదో! ఆ మలుపు తిరగ్గానే, కనిపించే చివరి ఇల్లే నండి" బండి ఆపాడు. ఇల్లు దగ్గర కొచ్చింది కాబోలు. "ఏం? ఆపేవ్?" అన్నాను. "ఈ సందులోంచి బండి పోదు బాబు. ఈడ దిగండి. సామాను నే కొం జోత్తా. ఇంకెంత దూరం?" సామానుదింపుతున్నాడు. బండిలోనుంచి క్రిందకు దిగాను. ఎదురుగుండా గాంధిగారి విగ్రహం కనిపించింది. పెట్టె, బెడ్డు, తలపైన పెట్టుకొని "పదండిబాబు" అన్నాడు మరచెంబు నాకందిస్తూ. అతన్నే అనుసరిస్తున్నాను. తిరగవలసిన సందు దగ్గరైంది. "బాబయ్యా ఒక్క పైసా దానం సెయ్యయ్యా, రెండు దినాలనుంచి కూడులేదు." దీనంగా అర్థించాడు లైటు స్తంభంక్రింద కూర్చున్న ముసలి బిచ్చగాడు. చాచిన చెయ్యి వణికి పోతోంది. అతనివైపు చూసాను. లోతుకు పోయిన్న కళ్ళు, ముడతలుపడిన ఒళ్ళు. ఒంటినిండా గుడ్డలేదు. ఉన్న కొంచెం గుడ్డ కూడ చివిగిపోయుంటె ముడులు వేసి కట్టుకున్నాడు. పెరిగి బాగా నెరిసి పోయిన గడ్డం. గుడ్లగూబలా గొంతుకూర్చున్నాడు. మోకాళ్ళు, చెవులదాకవచ్చి ఒక చేయిని భూమ్మీదుంచి, రెండోచేత్తో దారిని పోయేవాళ్ళను అడుగుతున్నాడు ధర్మం. మోకాళ్లసందులోంచి కనిపిస్తోంది వాడి, వాడి పోయినముఖం. ఉత్త, ఎముకలగూడు తప్ప ఎక్కడా కండలే లేవు వాడి శరీరంలో...నా వైపే ఆశగా చూస్తున్నాడు, కళ్లార్పకుండ. వాడి మాటలు కూడ తడబడుతున్నాయ్. వాణ్ణి చూడగానే ఎంతో జాలేసింది. పా

ఇంకా ఏ ఆశతో జీవిస్తున్నాడో? అప్రయత్నంగా జేబులోంచి పర్సు తీసాను. "అందుకోయే లచ్చి, అయ్యగారిస్తుండాడు" అంటుండగానే, ఆ ముసలివాడి వెనకాలే ముడుచుకొని పడుకొని వుండిన నాలుగేళ్ల పాప ముందుకొచ్చి చెయ్యి జాపింది. చినిగిపోయిన గౌను. చిందర, వందరగా అల్లుకుపోయిన జుత్తు, పాచిన పళ్లు చూస్తుంటే ఏదో బాధ అనిపించింది. పావలా చేతిలో వేయగానే, సంతోషంగా వెళ్లిపోయింది. "నీ పున్నెం బాబయ్యా నీ కడుపు సల్లగుండాల" కళ్లకద్దుకొన్నాడు లచ్చి చేతిలోంచి తీసుకొంటు. ఈలోపలే వెంకన్న చాలముందుకు వెళ్లాడు సామానుతో. వెనక్కు వెనక్కు చూసుకుంటూనే, వెంకన్నను అనుసరించి ఇల్లు చేరుకున్నాను. లోపల సామాన్లుంచాడు. ఇల్లంతా ఒకసారిచూసాను. బాగుందనిపించింది. "అమ్మగారెప్పుడొస్తారు బాబు" ప్రశ్నించాడు. "పురుడుపోసుకోడానికి పుట్టింటికెళ్లిందిరా...." అన్నాను. "ఎంతమంది బిడ్డలు బాబు?" తిరిగి ప్రశ్నించాడు. "నాలుగేళ్ల పాప" అన్నాను. సామానంత సద్దేసి "ఇంక నే ఎల్తా బాబు. మావోడికి, బండప్పచెప్పాలి....ఇంకా సాలా పనులుండాయ్ ఇంటికాడ..... ముసుగేసుకోస్తుండాది. .." అనే వెంకన్న మాటలు సగంలో ఆపి, "మరి భోజనం" అన్నాను. దగ్గర్లోనే హోటలుండాది. తమ కిట మైతే, పొద్దున్న, రేత్రి కూడ, కారియర్ కొండొత్తాను" అన్నాడు

"సరే....అలాగే చేయి" అనేశాను "మరి ఈ రేత్రికి భోజనం బాబుకి" ప్రశ్నించాడు.

"ఆకలిగాలేదు...ఈ వాల్టికి, అక్కర్లేదు' అన్నాను. "పొద్దున్నే పెందరాలే వత్తా బాబు" అంటూ వెళ్లిపోయాడు వెంకన్న. మళ్లీ, ఇల్లంతా కలయచూసాను. ఈసారి, మేడ మీదకువెళ్లి కిటికీ తెరిచాను. కొంచెం దూరంగా, ఇందాకటి గాంధిగారి విగ్రహం, లైటు స్తంభంక్రింద బిచ్చగాడు, పక్కనే పాప, రోడ్డుమీద జనం.. దూరాన సినిమా హాల్లోంచి కాబోలు సన్నగా పాట వినిపిస్తుంటే, మనస్సుకు అహ్లాదంగావుంది. ప్రతిరోజు, రాత్రి చల్లని వెన్నెల్లో కిటికీ దగ్గర కూర్చొని, చుట్టూ చూస్తుండిపోతే కాలం, సులువుగా గడచిపోతుందనుకున్నాను.

మెల్లిగా, క్రమంగా ఇంట్లోను, ఆఫీసులో కూడ సద్దుకున్నాను. ప్రతిరోజు ఆఫీసునుంచి తిరిగొస్తు,ఆ మలుపు దగ్గర ఆగి, ఆ ముసలివానికి ఐదు పైసలిస్తుండేవాడిని. రాత్రి అవగానే మేడమీది గదిలోని చూస్తుండేవాడిని. రోజ చూస్తున్నదృశ్యాలే సినిమాలో రీల్సులా దొర్లిపోతున్నా, లైటు స్తంభం క్రిందున్న ముసలివాడు, పాప మాత్రం నాలో ప్రత్యేకస్థానం ఏర్పరచుకొన్నారు—పాపం ఆ ముసలివాడికి.... పాప....కూడ....తోడు....దారినిపోయే వాళ్లనందరినీ, చేయి చాపలేక చాపుతు అడుక్కుంటుంటె ఒక్కరు దయదలచేవారు కాదు.అతను అక్కడుండడమే, మహాపరాధంగా భావించి, చీదరించుకొని తప్పించుకు తిరిగే వాళ్లవైపే బిక్కు బిక్కుగా, ఆశగా చూస్తుండేవాడు. పాప మాత్రం పక్కనే దుమ్ములో, రాళ్లతో ఆడుకుండేది. ఒకసారి ఎవరో....ఒకామె ఆగి ముసలివాని చేతిలో కొంత డబ్బుంచి, మళ్లీ చిల్లర తీసుకొంది. ఎక్కువ వేసాననేమో! ఎందుకు తీసుకోవాలి వెనక్కు.....? ఏమో! ప్రతివాడు కూడ తందాకవస్తే అలాగనే చేస్తాడేమో....మరోసారి, ఎవరో స్నేహితులు కాబోలు, హోటల్ లో భోంచేసి ప్రక్కనే కిల్లీకొట్లో, అరటిపళ్లు కొని జల్సాగా తింటూ, ముసలివాడున్నవైపే వస్తుంటే సరిగ్గా ముసలివాని దగ్గరకు రాగానే ఒలచిన పండు, ఒక పొట్లం క్రింద పడిపోయాయ్. గమనించి గమనించకుండా గర్వంగా వెళ్లిపోయాడు పాపం! బిచ్చగాడు క్రిందపడి, దుమ్ముపట్టిన వాటిని అందుకోవాలనుకొని చేయిజాచబోయాడు. కదల్లేకపోయాడు. పాప ప్రక్కనలేదు. చేతికర్రతో తీసుకోవా లనుకున్నాడు. కాని ఒణికే చేతులతో అవి అందటంలేదు. ఈలోగా, ఒక కుక్కవచ్చి నోట కరచుకుపోయింది పకోడి పొట్లాన్ని. కుక్కను కొట్టబోయాడు. కాని చేతకాక, మోకాళ్లలో ముఖం కప్పుకొన్నాడు. ఇదంతా చూస్తున్న నాకు ఏడుపు వచ్చినంత పనైంది మానవుల్లోనే ఇంత దీనస్థితిలోవుండేవారు ఇంకా ఎందుకు జీవిస్తుంటారో అనిపించింది. అనిపించినంతమాత్రానే నేనేం చేయగలిగాను? అంతటి జాలిగుండె గనక నాకుంటే ఆ బీద వాణ్ణి ఆదుకొని, బీదరికం తీర్చేయ్యొచ్చుగా.. కాని అంతటి సహాయం మాత్రం చేయలేక పోతున్నాను.

ఒక్క సంతృప్తిమాత్రం నాకు కలిగేది. ఆఫీసునుంచి తిరిగివస్తు, ప్రతిరోజు వాడికి ఐదుపైస లందిస్తుంటే వాడు కళ్లకద్దుకొని మురిసిపోతుంటె, సంతోషపడిపోయే వాణ్ణి లోలోపలె. పొద్దున్న, సాయంత్రం క్యారియర్ లో మిగిలుండేదంతా ఆ ముసలి వాడి కిచ్చిరమ్మని, వెంకన్నను పంపించేవాణి. నీళ్లు నింపుకొనేవాడు. ఈవిధంగా ఆముసలి బిచ్చగాడంటె అవ్యక్తానుబంధం ఏర్పడిపోయింది. అతని జీవిత చరిత్ర గురించి నాకు తెలిసిందల్లా, అతనికి వా ఈడుగల ఒక కొడుకున్నాడని, అతని కూతురే లచ్చి. దురవాట్లకులోబడి కొడుకు, తనకు దక్కకుండాపోయాడట. ముసలివానిభార్య ఎప్పుడో చనిపోయింది. ఇవన్ని కూడ వెంకన్నచెప్పాడు. ఇంకా తెలుసుకోవాలనుకొన్నానేగాని, ఏం ప్రయోజనం? బాధమాత్రం ఎక్కువై పోతుందిగాని, వాడి పేదరికాన్ని శాశ్వతంగా పోగొట్టలేకపోతున్నాను. పాపం వృద్ధాప్యంలో వాడికి ఎన్ని కష్టాలు పైగా. తనమీదే ఆధారపడ్డ ఆ పసిపాప. ఇప్పటినుంచే, ఆమెకు అడుక్కోవడం అలవాటుచేస్తే, భవిష్యత్తులో ఆమె జీవితం? అసలు ఈ పరిస్థితిలో, ఇంకెన్ని రోజులు బ్రతికుంటాడు? ఆలోచించినకొద్ది పరిష్కారం కనిపించని సమస్యగానే మిగులుతుంది. రోజులుయాంత్రికంగా గడచిపోతున్నాయ్. పురుడు పోసుకోడానికి వెళ్లిన భార్య దగ్గరినుంచి, టలా సాగా ఉన్నట్టు ఉత్తరాలొస్తున్నాయ్. అవి రాకపోతే ఆందోళన పడిపోతానని తెలుసు నా భార్యకు. ఆడవాళ్లకు పురుడు పోసుకోవడం అన్నది మరో జన్మతో సమానం. అదొక గండం. దానికి ఆమె మొదటి కాన్పే సాక్ష్యం. సుఖంగా వుండాలని, దేవుడికి మొక్కుకునేవాణ్ణి.

ఒకరోజు ఆఫీసులో బాగా ఎక్కువసేపు పనిచేసి, అలసిపోయి ఇంటికి తిరిగొచ్చాను. భోజనం ముగించి, మేడమీది కిటికిదగ్గర కూర్చున్నాను. ఇంకా ఫస్ట్ షో సినిమా వదల్లేదు కాబట్టి, ఆ ముసలివాడు కూడ వుండుంటాడనుకున్నాను కాని లేడు. ఏమైందో అతనికి అనిపించింది. చితికిపోయిన జీవితాలు---ఏవేవో పాడు ఆలోచన్లు భార్య దగ్గరనుంచి రావలసిన ఉత్తరం రాలేదు. మనస్థిమితం లేక నిద్ర కూడ రాలేదు. సెకండ్ షో సినిమాకువెళ్లి,సిదగా కూర్చొని వచ్చేద్దామనిపించింది బయలుదేరాను. తలుపుతాళంవేసి అడుగులువేసేటప్పటికి కాలిక్రింద ఏదో మెత్తగా తగిలింది—పర్సు పాపం.. ఏ అభాగ్యుడు పోగొట్టుకొన్నాడో చేతిలో తీసుకొని అడ్రస్‌గాని, ఫొటోగాని వుందేమోనని చూసాను. లేదు. లోపల రెండు ఐదు రూపాయల నోట్లున్నాయి. చుట్టూ కలయచూసాను. ఎవరూలేరు. ఆ పర్సు పోగొట్టుకొన్నవాడు ఎంతో బాధపడిపోతుంటాడు. వేరే వాడి కంటికే గనుక, ఈ పర్




భమిడిపాటి వెంకటరమణ

సాయంకాలం చీకట్లతోపాటు కారు మేఘాలు కూడ కమ్ముకొచ్చాయి. ఆకాశం ఆకలిగొన్న రాక్షసిలా నోరు తెరుచుకున్నది. భీకరంగా— లోకాన్నంతటినీ ఒక్కముద్దగా మింగేయాలన్నట్టు. ఉరుములు, మెరుపులు, పిచ్చిగాలి, పెనుతుఫాను వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. మూర్తిగారింట్లో 'ట్యూషను' ముగించుకొని ఇంటిముఖం పట్టాడు, రామం మూర్తి తల్లి సూరమ్మగారు ఇచ్చిన శ్రావణ మంగళవారం శనగలుసంచీ చేత పట్టుకొని. పైన ఆకాశం చాలా సందడి చేస్తున్నది. కటిక చీకటి అలుముకున్నది. ఎదుట ఏమీ స్పష్టంగా కనిపించడంలేదు. క్షణమాత్రం మెరిసే మెరుపుల్లో దారి వెదుక్కుంటూ దడదడ లాడే గుండెలతో తడబడుతూన్న అడుగులతో వడివడిగా పోతున్నాడు రామం. కిరాణా [illegible] "ఏమి మాస్టారూ, ఇయ్యాళ మా లెక్క [illegible] చెప్తామన్నారే" అని. "పెద్దవాన వస్తూంది. ఇంటికి పోవాలి తొందరగా. ఇవాళ వ్యవధి లేదు. రేపు లెక్కచూపి చెప్తాలెండి" అంటూ సాగిపోయాడు రామం. రామం వుంటున్నది ఒక మారుమూల. సదర్‌రోడ్డును దాటి, సన్నరోడ్డున పోయి, ఆలోపల సందు మలుపు తిరిగి, యింకా లోపల చీకట్లో చెట్ల గుబురుల మధ్య ఇల్లు. సందుకి రెండు ప్రక్కలా కాలువలు, మురికి గుంటలు. సందు మలుపున పెద్ద గండి. ఒకప్పుడు చెరువులు ఈ ప్రదేశాలు. ఇప్పుడిక్కడ ఇళ్ళు లేచాయి. పట్నంలో ఇల్లు దొరకడం మహాకష్టం. అందులో తనవంటి పేద కుటుంబీకుడికి. పట్నాలలో ప్రజలు తెలివయినవాళ్ళు. ఇళ్ళకి రద్దీగావుంది గనుక పెరటి గోడల ఆనించి ఒక పంచ వేయించి, గడ్డిదయినా, పెంకులదయినా సరే, రెండు గోడలు మట్టివయినా ఇటుకలదయినా పెట్టించి రెండు తలుపులు తగిలించి అద్దె ఇళ్ళు సృష్టిస్తారు. ఏ రక్షణాలేని యిలాటి ఇళ్ళలో తలదాచుకోవాలి రామంలాంటివాళ్ళు. ఇంటిగల ముసలిది తననింకా కరుణించానంటుంది. లేకుంటే ఐదుగురు పిల్లలతో ఈ వంద రూపాయల ఉద్యోగికి ఇల్లు ఇచ్చేదెవరు? ఆమె హృదయం కనికరంతో నిండివుంది. ఆ కనికరంతోనే ఆమె కుటుంబానికొక గది చొప్పున [illegible] కిచ్చింది ఆ యింటిలో. కొడుకు కోడ[illegible] కూడ ఒక గది ఇచ్చి వారి దగ్గరా అద్దె వసూలు చేస్తూంది ఆమె. ఎప్పుడూ పిల్లలకి ఏదో ఒక రుగ్మత వెంటాడుతూనే వుంటుంది. ఆ చెమ్మనేలలు, ఆ మురికి గుంటలు. దోమలమధ్య పిల్లలేకాదు పెద్దలూ తప్పించుకోలేరు రోగాల బారినుండి.

వాన వెంట తరుముకొని వస్తున్నది. పరుగు పరుగున ఇంటికి చేరాడు రామం. అడుగులు చప్పుడు కాగానే తలుపు తీసింది శాంత. పిల్లలంతా నిద్రపోతున్నారు.

"అమ్మయ్య వచ్చేశారూ, ఇంత ఆలశ్యమయితే ఈ రాత్రి మీ రెక్కడ చిక్కుపడ్డారో అని భయపడుతున్నాం. ఎంత భయంకరంగావుందో బయట" చేతిలోని శనగల సంచీ అందుకొన్నది శాంత.

"నిన్ననే బాబుగాడికి జ్వరం తగ్గిందనుకుంటే ఇవాళ ఈ చంటిదానికి జ్వరం తగిలింది" అన్నది శాంత. మంచంమీద నిద్రపోతున్న పాప ఒంటిమీద చెయ్యివేసిచూశాడు రామం. ఒళ్ళు కాలిపోతున్నది. నూటరెండు డిగ్రీలు వుండవచ్చు జ్వరం అనుకున్నాడు.

"ఈ రాత్రి, ఈవాన ఎక్కడికి వెళ్ళగలం. అదృష్టం బాగుంటే రేపొద్దున ఆసుపత్రికి తీసుకొని వెళదాం" అన్నాడు రామం. రెండు మెతుకులు తిని నిద్రపోదామనుకుంటే పడుకునేందుకే చోటులేదు తనకు. ముందు గది అంతా కారుతున్నది. మధ్యగది ఒక్కటే వెచ్చగానున్నది. పైన రేకుమీద రాళ్ళవాన కురుస్తున్నది. శాంత, చంటిపిల్లా ఒక మంచంమీద, మిగతా పిల్లలందరూ ఇంకొక మంచంమీద పడుకున్నారు. తను ఆ వీధి అరుగుమీద గదిలోనే కాస్త చోటు చూసుకొని నిద్రపోయాడు రామం. రాత్రంతా మహా సముద్రపు ఘోషలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఎవరో అరుస్తున్నారు. ఏదో అలజడి పిల్లల ఏడ్పులు, కేకలు. పిల్ల జ్వరం మూల్గులూ కలతగా గడిచింది. తెల్లవారు

తూంది. కాలికి చల్లగా పాములా ఏదో తగిలితే లేచికూచున్నాడు రామం. వీధి అరుగు మీది బొందిలోంచి నీరు గది లోపలికి తల దూరుస్తున్నది పాములాగ. అప్పుడే గోడకి రెండు వైపులా ఒక పాయ ప్రాకిపోయింది. కిటికీ తలుపులు తెరచి బయటకి చూసాడు. నీరు ప్రవాహం. నీరంతా ఇటువైపుకే ప్రవహిస్తున్నది. రాత్రి ఎంత వాన కురిసిందో మరి? రోడ్డు మునిగిపోయింది. అరుగు మునిగిపోయింది. ఇంటిలోవున్నవారందరూ లేచి వున్నారు. పిడికిట ప్రాణాలు పెట్టుకొని ఎప్పుడు తెల్లవారుతుందా అని చూస్తున్నారు. ఇంటిగల ముసలిది తానున్నగదికి నాలుగువైపులా ఇసుక గోడలు వేయిస్తున్నది పనివాడిచేత. ఎదుటి అరుగుమీద గదిలోని గోపాలం తలక్రింద పెట్టుకొన్న ముప్పై రూపాయలు కాగితాలు తడిసి ముద్దయి పోయాయి అని గోల పెడుతున్నాడు. ప్రక్కగదిలోని చుట్టాలవాళ్లు— రాత్రి పాతిక రూపాయల పొగాకు కొని తెచ్చారు. అదెక్కడ నీట్లో మునిగిపోతుందోనని పెట్టెలో పెట్టి, తలపై పెట్టుకొని తిరుగుతున్నారట. దానిమీద ఆధారపడివుంది వారి భుక్తి. రెండోవైపు గదిలోని పోస్టు జవానూ, పెళ్లాం సామానంతటినీ బల్లమీదకు చేర్పించి అరుగు మీద నిలబడి వున్నారు. ఆవిడకు ఆయాసము ఎక్కువవుతూంది. ఎంతవేగం తెల్లవారుతుందా ప్రాణాలతోనయినా బయపడదామని చూస్తున్నారు.

శాంతతోపాటు పిల్లలు ఒక్కరు ఒక్కరే లేచారు. చంటిది మాత్రం కన్ను తెరవలేదు. ఇంటిలో ప్రవేశించిన శత్రువుని బయటకు వెళ్లగొట్టాలి అని గిన్నెలతో, చెంబులతో నీరు చేది బయట పోస్తున్నారు. ఏమి ప్రయోజనం? అది వాళ్లకొక ఆట అయింది. వాన కురుస్తూనేవుంది. గదిలోకి నీరు రాకుండా చేయడం అసాధ్యమయింది. మధ్యగదిలోకి కూడ నీరు రాకుండానే వంట చేసుకొని పిల్లలకు అన్నాలు పెట్టేస్తే మంచిది. ఏసమయానికి ఎలాగుంటుందో అని వెంట వెంటనే వంట చేసి పిల్లలకు అన్నాలు పెట్టి రామం శాంతకూడ భోజనాలకని కూర్చున్నారు. పెరట్లో ప్రవేశించిన నీరు అంతకంతకు అధికమయి, అడ్డు వేసిన ఇసుక గోడల్ని కూల్చివేసి అకస్మాత్తుగా ఇంట్లో ప్రవేశించింది. ఒక్క దూకున. చూస్తూవుండగా మధ్యగదిలో నీరు నిండిపోయింది. మోకాలు లోతున గిన్నెలు, చెంబులు, కంచాలు నీటిమీద నాట్యాలు చేస్తున్నాయి.

ఒకరు ఒకరుగా దారి తీస్తున్నారు బయటికి ఇంటిలోనివాళ్లు. ఇంటికి ఎదురుగా ఉన్న ఎత్తైన మేడ ఇల్లు బెంగాలీది. అన్నదమ్ములు నలుగురూ కలసి వుంటున్నారు భార్యాపిల్లలతో. పల్లపు జాగాలో ఇల్లు అయినా తెలివిగా కట్టారు. ఎత్తైన పునాదులు. ఎత్తైన అరుగులు, దాబా మీద కూడ గదులు కట్టారు. పెద్దాయన కేకవేసి పిలిచాడు రామాన్ని, "మాష్టారూ, మీరు పిల్లలూ ఇక్కడకి వచ్చేయండి. సామగ్రి మాట తరువాత చూచుకోవచ్చు. తలుపులకి తాళాలు వేసుకొని వచ్చేయండి." అంటున్నాడు ఆయన. ఈ యింటి గుమ్మానికి ఎదురుగానే వారి పెరటి గుమ్మం. తలుపు తెరిపించారు. శాంతను పిల్లల్నీ అక్కడ చేరవేసాడు రామం. పిల్ల పరిస్థితి చూసి గుండె బాదుకొన్నాడు బెంగాలీ ఆయన. "జ్వరం చాలా తీవ్రంగా వుంది. చల్లగాలి తగలనివ్వకండి. ముందు గదిలో సోఫాలో పిల్లను పరుండబెట్టండి" అని చెప్పి, ఏవో మందులు కూడ తెచ్చి యిచ్చాడాయన. పెట్టె, బేడా, బట్టలు, బియ్యం, పిల్ల పాలడబ్బా, కాఫీపొడరు, మిల్కుపొడరు, కుంపటి, శనగలూ ఒకటి ఒకటిగా చేరవేసాడు రామం ఇవతలకు ఆ జలమగ్న గృహంలోంచి.

ముందురోజు మురికి కాలువ ఈనాడు మహా సముద్రమయి తనకు అడ్డు తగులుతూంది. దీనిని దాటడానికి శక్తి చాలకుండా వుంది. ఇంటిగల ముసలిది అరుస్తున్నది. "ఎవరు మట్టుకు వారు జారిపోతున్నారు. ఇలాటి పరిస్థితిలో ఏమీ అడ్డు చెప్పలేను కాని ఎవరయినా ఇదే సందు అని నా అద్దె బకాయి ఎగరవేద్దామనుకుంటే వదిలేదు లేదు. ఎక్కడున్నానరే వెళ్లి వసూలు చేస్తాను. మర్యాదగావచ్చి ఇచ్చి వెళ్లవలసినదే. ఈ నాలుగైదురోజులు ఇల్లు వదలిపెట్టామని ఇంటి అద్దె తగ్గించమంటేమాత్రం వినేదిలేదు. పూర్తి అద్దె ఇచ్చుకోవలసిందే!" అందరికీ వినబడేలాగ ఆజ్ఞలు జారీ చేస్తున్నది. కొడుకూ కోడలూ కూడ బయటికి వచ్చేసారు. ముసలిది మాత్రం రానంటుంది ఇల్లు కదలి. అప్పటికప్పుడే ఇంట్లో నాలుగు అడుగులు నీరు నిలిచింది. మంచంమీద కుర్చీ వేసుకొని కూర్చున్నది లీవిగా. ఆ జల సామ్రాజ్యానికి రాజ్ఞిలాగ. గదినిండా నీరు. అందులో ఎక్కడో ఆ ముసలిది డబ్బు దాచిందంటారు. కుండలో బంగారం, రూపాయలు వున్నాయంటారు. ఇప్పుడు దాని పాపం పండిది. కాదు బ్రహ్మాండం బ్రద్దలయింది. అందరికీ బాధ కల్గుతూంది. రోజంతా వాన కురుస్తూంది. రాత్రి వానకే వూళ్లో చాలా చోట్ల నీటిలో మునిగిపోయాయి. పూరి గుడిశలు కొట్టుకొనిపోయాయి. రోడ్లమీద గండ్లుపడి నీరు నిలిచిపోయింది. వేలాది ప్రజలు ఇళ్లూవాకిళ్లూ వదలిపెట్టిపోయారు. బీదా బిక్కీ ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొని పరుగెత్తుతున్నారు. సురక్షిత స్థలాలకిపోయి తలదాచుకుంటున్నారు. సర్కారు వారు అటువంటి స్థలాలు తెలియచేస్తున్నారు రేడియోలో. బెంగాలీవాళ్ల ఇంటి అరుగుల మీద వరండాలమీద చుట్టుపక్కల ఇళ్ల వాళ్లందరూ వచ్చిచేరారు. కొద్దో గొప్పో తమ సామగ్రిని కూడా తీసుకొని.

పొరుగింటి మూగపిల్ల ఒకటేగోల పెడుతున్నది. వాళ్ల ఆవులు దూడలు నీటిలోనే వుండిపోయినయి. దాని గోల వినేదెవరు? మనుష్యులకే తలదాచుకునే చోటులేదు. ఈ పశువుల్ని ఎక్కడ వుంచుతారు. పాపం నోరులేని జంతువులు గునుస్తున్నాయి నిశ్శబ్దంగా ఈ మనుష్యుల సంరంభం. పిల్లలు ఇదంతా వేడుకగా చూస్తున్నారు.

సాయంత్రం మళ్లీ శాంతా పిల్లలూ ఇంత అన్నం శనగలు తిన్నారు. పిల్లల్ని పరుండ బెట్టారు. చంటివానికి జ్వరం తగ్గలేదు. "ఈ గండం గడిచి బయటపడేవరకు ఈ పిల్లకి ఏ ఆపద రాకుండా కాపాడు భగవంతుడా" అని రాత్రల్లా ప్రార్థిస్తున్నాడు రామం. రాత్రల్లా వాన కురుస్తూంది. ప్రకృతికి ఎందుకంత కసి ఈ నిస్సహాయ ప్రజలపైన? ఒకర్రాత్రప్పుడు ముసలిదికూడా వచ్చిచేరింది. దాని బంగారం కుండ ఏమయిందో—ఎవరికీ తెలీదు.

ఉదయం ఎనిమిది గంటలయింది. వాన వెలిసినట్టుంది. బయటకు పోయి చూస్తే అంతా ఒకే ఒక జలమయం. కనుచూపు మేర అంతా నీరే. గంభీరమైన, శీతలమైన, అనివార్యమైన జలసాగరం. బెంగాలీవాళ్ల ఇంటి అరుగుల్ని కూడ అతిక్రమించి లోపలికి ప్రవేశించింది నీరు. పెద్దాయన రామాన్ని పిలిచి చెప్పాడు :

"ఈ రోజుల్లా కూడ వానకురిస్తే ప్రమాదమే. ఇప్పటికే ఇంట్లోకి నీరు వచ్చేసింది. ఇక ఇక్కడకూడ నిలబడేందుకు తావుండదు. మేమయితే మేడమీద గదుల్లోకిపోతాం. మీరంతా ఏదోవిధంగా బాధపడతారు. మీరు

# వారఫలం

**21-1-1966 శుక్రవారం మొదలు**
**27-1-1966 గురువారం వరకు.**

**మేషం :** గతవారం కంటే ఈవారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు ఏవో కారణాలవలన ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో ప్రతిబంధకాలు ఏర్పడినా, మిత్రుల సహకారంతో అనుకూలతను సాధించగలరు. వారాంతంలో ఆకస్మికంగా వ్యయ ప్రయాసలకు గురికాగలరు. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్రను నిర్వహించగలరు. కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సంబంధ సంతోషాలు లభిస్తాయి.

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లో మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో పోటీదారితో ఇదివరకు ఏర్పడిన పోటీ చాలవరకు తగ్గడం వలన మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. వ్యాపారరీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**మిథునం :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడటం వలన ఆదాయం కొంచెం బాగా ఉన్నా అంతా వారికి సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని వాటిని గురించి ప్రయత్నించడంవలన శ్రమకు గురి కాగలరు. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలుమాత్రం ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన చిక్కులు తొలగిపోతాయి. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకురాని కార్యభారాన్ని వహించగలరు.

స్త్రీలకు—స్వల్ప అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** సాహసించి ఏదైనాచేయడానికి అవకాశం లేని సమయం. మీరు ఇదివరకు ఎంతో కృషి చేసి ఒక దారికి తెచ్చిన వ్యవహారాలు ఫలోన్ముఖం కానున్న సమయంలో కొత్త సమస్యలు తలెత్తడం వలన ఆందోళన కలుగుతుంది. వృత్తిలో కొత్తవారి పోటీ పెరగడంవలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. మీకు అంతగా ఇష్టం లేకపోయినా, కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసివస్తుంది. ఉద్యోగంలో మీకు మున్ముందు ఉపయోగించగల మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉండదు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**సింహం :** మీరు ఎంతజాగ్రత్తగాఉన్నా, కొన్ని వ్యవహారాలు మీ అదుపుతప్పి ఊహించని పరిణామాలకు గురికాగల సూచనలు ఉన్నాయి. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో ఇతరుల జోక్యం వలన నష్టం వస్తుంది. ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు పని గట్టుకొని మీమీద దుష్ప్రచారంచేసే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో ప్రయోజనంకంటే ప్రయాస అధికంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. పోటీదారితో వాద ప్రతివాదాలకు దిగడం తగదు.

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు ఏవో ఆటంకాలు వచ్చేటట్లు కన్పిస్తాయిగాని మీరు చాకచక్యంతో వ్యవహరించడంవలన వాటిని అధిగమించడమే కాకుండా తగిన అభివృద్ధిని సాధించగలరు. కొన్ని వ్యవహారాల్లో కార్యసాధనకోసం మీకు అంతగా ఇష్టం లేని వ్యక్తులతో సన్నిహితంగా వ్యవహరించవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడి కృషి చేసినా నిష్ఠూరం తప్పకపోవచ్చు. సాంఘిక వ్యవహారాల్లో మీకు మున్ముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. మానసిక విషయాలను



సీరియల్

# కరుణ






కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథుని జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. మన్మథతో కరుణ పెళ్లి విషయం తనే ప్రస్తావిస్తానని మన్మథుకు మాట ఇస్తాడు చలపతి. కరుణను ప్రసన్నకు చేసుకోమని జమదగ్ని కోరినాకూడా, కరుణ ప్రసన్నలు ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే కరుణ భార్య కావాలని పట్టుపట్టాడు విశ్వనాథం. కరుణను ప్రసన్నకే ఇచ్చి చేయడానికి మన్మథ ఇష్టపడతాడు. ఈ పరిస్థితిని పూర్తిగా విశ్వనాథానికి వివరిస్తాడు జమదగ్ని. అయినా విశ్వనాథం ప్రసన్నకే కరుణను ఇస్తానంటాడు.

## 13

"ప్రొద్దున్ననగా వెళ్లారు. ఎక్కడికి వెళ్లారండీ—? ఈ రావడమేమిటి?— ఎక్కణ్ణుంచి? మధ్యాహ్నం భోజనం చేశారా?" శారదాంబ ఆత్రుతగా అడిగింది.

"అమ్మా! నాన్నగారు క్రొత్త గ్లాస్కో పంచె కట్టుకున్నారే?— ఉత్తరీయం కూడా క్రొత్తదే!"

కళ్యాణి గుర్తించినట్లుగా అన్నది. తండ్రి చేతిలో గొడుగు ముడిచి, మూలనపెట్టింది.

"కాసిని మంచి తీర్థం తెచ్చిపెట్టు తల్లీ!" కళ్యాణి లోపలికి వెళ్లిపోయింది.

ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. జమదగ్ని హాల్లో వున్న కుర్చీలో విశ్రాంతిగా కూచున్నాడు. ప్రొద్దున్నుంచి జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు శారదాంబకు. అంతా చెప్పింతర్వాత, కళ్యాణి తెచ్చి ఇచ్చిన మంచి నీళ్ళు త్రాగి, "నేనా అబ్బాయికి మన అమ్మాయి నివ్వాలని అనుకొంటున్నాను. అతను చాలా యోగ్యుడిలాగు కనబడుతున్నాడు. నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. శారదాంబ కళ్యాణిని అడిగింది. "ఏమ్మా? నువ్వా కుర్రవాణ్ణి చూశావా?" కళ్యాణి కనుబొమలు ముడిచింది. జమదగ్ని అందించాడు. "అదేనమ్మా! నాకోసం నటేశంగారని ఒకాయన వస్తుండేవారుకదూ? ఆయన కూడా ఇంకో అబ్బాయి కూడా వస్తుండేవాడు. ఎర్రగా, సన్నగా, ఉంగరాల జుత్తుతో, కడిగిన ముత్యంలా....."

తండ్రి వర్ణన విని కళ్యాణికి నవ్వు వచ్చింది. "చిన్నన్నయ్య క్లాస్‌మేట్ నాన్నా ఆయన!"

"అయితే ఇంకేం?— చూశావన్నమాట. ఏమిటి చెప్పు?—సిగ్గుపడకు. నీకు నచ్చినట్లేనా?"

కళ్యాణి చేతుల్లో మొహం దాచుకొని, లోపలకు పరుగెత్తింది. కూతురివేపే ప్రేమగా చూస్తూ అన్నది శారదాంబ. "పిచ్చితల్లి! దానికేం తెలుస్తుందిగనుక!! మనం ఎలా చెబితే అలా వింటుంది. ఆయన మన తెలుగువాడేనా? ఎక్కడో అరవదేశం నుంచి వచ్చార్ట!!"

"తెలుగువాడు మాత్రమేకాదు. మన కులంవాడు కూడాను! ఎప్పుడో తాతలనాడు ఈ గడ్డ వదిలిపెట్టిపోయారు. మళ్లీ నటేశం భూమి గుండ్రంగా వుందని ఇక్కడికేవచ్చి ఈ మట్టిలో మట్టైపోయాడు. నీ కా సందేహాలు అక్కర్లేదు."

శారదాంబ పాతకాలానికి ప్రతినిధి. క్రొత్త యుగంతో ఉండడం అలవాటు చేసుకుంటోంది. ఉండబట్టలేక అడిగేసింది. "దివాళా తీశారన్నారుకదా, వాళ్ళ అబ్బాయికి మన అమ్మాయినిస్తే మన పరువు ప్రతిష్టలు పోవుటండీ!"

"అయితే విశ్వనాథం తన కూతుర్ని మన ఇంటి కోడలు చేస్తే మాత్రం ఆయనకు పరువు నష్టం కాదుటే! మనం దివాళా తీసిన సంగతి ఇంకా నలుగురికీ తెలియలేదు. నటేశం సంగతి అందరికీ తెలిసిపోయింది. అంతే తేడా! ఆ కుర్రవాడు బంగారం అనుకో!"

శారదాంబ ఒప్పుకోనూలేదు. అయిష్టత కనబరచనూలేదు. "ఆలోచించండి. మీకు ఇష్టమైతే నేను కాదనేది వుండదు" అని ఇంట్లోకి వెళ్లిపోయింది.

నటేశం కొడుకుకు, కళ్యాణినిచ్చి పెళ్లి చేస్తే, చితికిపోయిన సంసారానికి పూసిరి పోసినట్లవుతుందనిపించింది. ఆ సంగతి చలపతితో చెప్దామని ఆయన పాకలోకివెళ్లాడు. జమదగ్ని తనను భోజనానికి పిలవడానికే వచ్చాడనుకొని, "వస్తున్నాను! ఈ ఒక్క శ్లోకము పూర్తిచేసి." అన్నాడు.

"నే నీ పూట భోంచేయను. నువ్వీపూట వంటరిగానే భోంచేసిరా!" అంటూ అక్కడ వున్న మంచంమీద కూచుని కళ్యాణికి తను స్థిరపర్చిన సంబంధాన్ని గురించి, ప్రసన్నకు కరుణను నిశ్చయమనుకొన్న సంగతి చెప్పారు. అంతా చెప్పి, చిట్ట చివ్వరికి "నీకు నచ్చినట్టేనా?" అన్నాడు.

చలపతి, చదివినంతవరకూ భగవద్గీతలో ఒక గుర్తుపెట్టుకుని, లేచి కూచుంటూ, "నాదేముందండీ! — నా అభిప్రాయాలకు పెద్ద విలువేముంది?— ప్రసన్న కరుణ ప్రేమించి చేసుకుంటున్నారుకదా! ఇహనక్కడ మరో ప్రశ్నలేదు. ఇంక కళ్యాణి అంటారా? పిచ్చితల్లి! మీరు ఎవర్నిచేస్తే వాళ్లనే చేసుకుంటుంది." ఆ మాటలని చలపతి ఇహా నక్కడ నుంచోలేదు. మెల్లగా వంటయింటి వేపుగా, కుంటుకుంటూ నడుస్తూ వెళ్లిపోయాడు. జమదగ్నికి దిగ్భ్రాంతి కలిగింది. ఇంతవరకూ ఎన్నడూ చలపతి అట్లామాట్లాడి ఎరగడు. కాసేపు అక్కడే కూచుని, ఇంట్లోకి వస్తుండగా, మన్మథ ఎదురుపడ్డాడు. అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పి "నీ అభిప్రాయం



సిక్కిం దట్టంగా అల్లుకుపోయిన పొగమంచు దృశ్యం          వినోద కార్యక్రమాలు అక్కడి జనజీవనంలో ఒక భాగం

# సిక్కిం...!

క్రమంగా సిక్కిం ప్రాముఖ్యత పెరుగుతోంది కాశ్మీర్‌ని కాపాడినట్లే ఇప్పుడే దాన్ని కాపాడటం అవసరమేమో! నేటి రాజకీయాలలో సిక్కిం స్థానం ఎటువంటిది?

## ప్రశాంత దేశం

కొండలమీద గ్రామాలతో నిండిన చక్కని దేశం సిక్కిం మొత్తం వైశాల్యం సుమారు 2,800 చ. మైళ్ళు ఎటు చూసినా హిమాలయ పర్వత శిఖరాగ్రాలూ, గాఢమయిన అగాధాలూ కనిపిస్తాయి తూర్పున నేపాల్, పడమట భూటాన్, దక్షిణాన భారతదేశం ఉన్న సిక్కిం, చైనా కంట బడింది అప్పుడే పీకింగ్ తన ఎత్తులు వేస్తోంది

అసలు సిక్కిం చరిత్ర చూస్తే యుద్ధం కన్నా కనిపించదేమో, 18వ శతాబ్దంలో నేపాళ దేశంవారు కొందరు దండెత్తి వచ్చారు కాని (1789 లో), బ్రిటిషువారు వారిని వెనక్కు తరిమివేశారు ఈ రక్షణకు బహుమతిగా డార్జిలింగ్ జిల్లాని తీసుకున్నారు అప్పటినుంచి ఈ దేశరక్షణ భారతదే బాధ్యతగా ఉండిపోయింది

నేడు భారతదేశం సిక్కింకి ఎంతో సహాయము కూడా చేస్తోంది

సిక్కిం నిజంగా శాంతినిలయం వాహనాలు తిరిగే ఈదేశపు రోడ్ల వెంబడి ప్రయాణము చేస్తూ ఉంటే, అక్కడి ప్రశాంత వాతావరణంలో ఆధునిక ప్రపంచంలో ఎక్కడ చూసినా ఎదురయ్యే 'భయం', జాడావుండ కనిపించవు 'బాకూ' అనబడే దుస్తులు ధరించిన సిక్కిం స్త్రీ పురుషులు, దాబాలు దాబాలుగా వేసిన పొలాలలో, కొండ చరియలమీది పళ్ల చెట్ల తోటలలో పనిచేస్తూ విశ్రాంతి తీసుకొంటూనో కనిపిస్తారు పండించినంత తింటారు ధరించే వస్త్రాలని నేస్తారు కావలసిన దేవుళ్లని పూజిస్తారు

## రాజధాని

సిక్కిం రాజధాని గాంగ్‌టాక్ ఇది 5,800 అడుగుల ఎత్తున ఉన్న చక్కని పూరు ఇక్కడికి రోడ్డుమీద వెళ్లవలసిందే—ఎందుకంటె సిక్కింలో రైలుబండి లేనేలేదు గాంగ్‌టాక్‌కి వెళ్ల రోడ్డు అవూరు అవతల ఎంగిక్ దాకా ఉంటుంది. ఎంగిక్ నుంచి కాంచన్‌జంగా శిఖరం బాగా కనిపిస్తుంది

సిక్కింలో మొత్తం 40 మంది హిందువులు మిగిలినవారు బౌద్ధులు కాని సిక్కిం ప్రజలంతా ఇంచుమించు ఒకేవిధంగా బతుకుతారు కాబట్టి వీరి పద్ధతులలో ఒకేరకమయిన విశేషాలెన్నో కనిపిస్తాయి సిక్కిం దేశస్థులకి 'అష్టమంగళ'సంజ్ఞలమీద చాలా నమ్మకం ఇవి వేసిన చోట శుభం కలుగుతుందిట చైనా విపత్తు(?) బారినుంచి ఈ అష్టమంగళ చిహ్నాలే వీరిని రక్షించుగాక!

-సుశీలారావు.



# కరుణ

విపరీతమైన కోపం వచ్చింది. నాతకం పేరో చెప్పి, పెళ్ళిని కాదంటున్న తల్లిమీద విసుగు వచ్చింది. తల్లి దగ్గరకువెళ్ళి తన మనస్సులోని మాటలు నాలుగూ అనేశాడు. "నాకు వీటన్నింటిమీదా నమ్మకంలేదు. నీకు తెలుసా? కర్మ, గిర్మ, ఇవన్నీ నా నీ కోసమని చేశాను. నాకు నమ్మకం వుండికాదు. అంచేత ముహూర్తం పెట్టించు. మా మామగారు జమదగ్నిగారి మనసు నొప్పించకు." అప్పటికీ గోవిందమ్మ పాత ఆచారాలు ఆవిడకు అడ్డొచ్చాయి. ఆమె నలుగురికీ భయపడింది. "కాదురా తండ్రీ—నామాట విను. ఆ అమ్మాయిని కోడలుగా తెచ్చుకోవడం నాకూ ఇష్టమే! కానీ లోకం కాకై కూస్తుంది. వేలెత్తి చూపిస్తుంది. 'తండ్రి చచ్చి నెలరోజులు దాటలేదు—అప్పుడేపెళ్ళికి సిద్ధపడ్డాడు మహాతండ్రి' అంటూ విన్నా, 'కొడుక్కు బుద్ధి లేకపోతే, నీ కెక్కడికి పోయిందమ్మా, ఆ మహానుభావుడు పోయి పట్టుమని పదినెలలు కాకముందే కొడుక్కు పెళ్ళి చేసేయాలని పట్టుబట్టావ్!' అంటూ నవ్వా దుయ్యబడ్తారు. అందుకని. అంత కన్నా మరేంలేదు. కాస్త ఓపికపట్టు. నా తండ్రివికద్యూ, నా బంగారుకొండే, నా వర హాల మూటే" అంటూ ముద్దెట్టుకుంది. వీరభద్రానికి అటువంటి అమాయకమైన తల్లి ప్రేమ అంటే చిదరింపు. అందుకనే "ఛీ! ఛీ!" అంటూ నుదురు తుడిచేసుకుని, దూరంగావెళ్ళి నిల్చుని, సమాధానం చెప్పాడు, పెదవులపై సన్నగా నవ్వు తెప్పించుకుని,

"అమ్మా! ఎంత వెర్రిదానవు అయిపోయావే! పిల్లను చూసి కాదే, పెళ్ళి వెనకాలవున్న ఆరెకరాల కొండగల ఆసామీని చూసి! ఎంత డబ్బు లేకపోతే, అయిదు వందలు అట్లా అడగంగానే తెచ్చి ఇస్తాడు? కట్నం పేరుతో కాస్త డబ్బు గుంజితే, పై చదువులు చదవాలని వుండే నాకు?"

"హరి పిచ్చికొండా! ఎంత తెలివిగలవాడివి అయిపోయినావురా!" అంటూ గబ గబా వెళ్ళి ఇన్ని మిరపకాయలు తీసుకువచ్చి, దిష్టితీసి, "లక్షణంగా నెయ్యేళ్ళు బతుకు తండ్రీ!" అంటూ అవి అవతల పారబోసి వచ్చింది.

అంతవరకూ నిలబడ్డ వీరభద్రం, తల్లి మళ్లీ లోపలకు రాగానే అడిగేశాడు. "ఇహ, నీ సందేహాలు తీరిపోయినట్టేనా? డబ్బు కావాలి, ముహూర్తం పెట్టిస్తావా?"

గోవిందమ్మ పక్కున నవ్వింది. "డబ్బు కావాలంటే, ముహూర్తం పెట్టించాల్రట్రా? అంత మోజువున్న మనిషి ముక్కుపిండడం ఎంత సేపట్రా?"

అట్లా తల్లీ కొడుకులు మాట్లాడుకొన్న తర్వాత, మర్నాడు జమదగ్ని వచ్చింతర్వాత ఆయనతో అన్నది గోవిందమ్మ. "అన్నయ్య గారూ! మీరిన్నిసార్లు తిరుగుతున్నారు. నాకు ఎంత సిగ్గుగావుందో! మిమ్మల్ని కాదనడం ఇహ మావల్లకాదు. అంచేత మీరన్నదానికి తథాస్తు అంటున్నాను."

"అమ్మయ్య!" గుండెలమీద బరువు దిగినట్లుగా పెద్ద నిట్టూర్పు వదిలాడు జమదగ్ని. "మీరు మా సంబంధం ఒప్పుకున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది."

"నాకూ చాలా సంతోషంగా వుంది. ఇహ అబ్బాయి మీ అబ్బాయే అనుకోండి. వాడికిమాత్రం ఏ నారుమంది ఉన్నారు కనుక? ఇహ నుంచీ వాడి ఆలనా పాలనా అంతా మీదే!"

"అట్లాగేనమ్మా! అబ్బాయికి ఏలోటూ రాకుండాచూసే పూచీ నాదీ!—సరేనా?" జమదగ్ని సంతోషంతో తేలిపోతూ, వెళ్ళిపోవడాని కుద్యుక్తుడయ్యాడు.

గోవిందమ్మ, అతని దగ్గరనుంచి అనత్రైన మాట రాకుండా ఆయనను వెళ్ళిపోనీయదల్చుకోలేదు. అందుచేత, ఆలస్యంచేస్తే ఆయనెక్కడ గడపదాటతాడోనని, చల్లగా మనసులో విషయాన్ని బయట పెట్టేసింది.

"మే మా కట్నం కానుకల విషయమై అంత పట్టించుకొనగలవాళ్ళంకాదు. ఎంతైనా అంటారా?—అది మీ ముచ్చట. పదిమందిలోనూ, 'ఫలానావారి వియ్యంకుడింత ఘనంగా జరిపించారటయ్యా పెళ్ళి?' అని చెప్పుకోడం మాకూ మీకూ కూడా గొప్ప కాదుటండీ? చెప్పొచ్చునుకదా, నాకుగాని, అబ్బాయికిగాని కట్నంమీద ఆశలేదని. అయితే వాడి కొక్క కోరికవుంది."

"ఏమిటండీ అది?"

"ఆ! మీరు నెరవేర్చలేనిదికాదు. వాడికి ఏ యమ్మేనో చదువుకుందామని మహా కోరిగ్గావుంది. ఆ మహారాజేవుంటే, లక్షణంగా కొడుకు చదువు ఆయనే చదివించు కోను! నీటిలోనుండి బయటపడ్డ చేపల్లా మేమిట్లా విలవిల్లాడకపోదుము. ఏం చేయం బాబుగారూ! నేనా ఆడదాన్నైపోయాను. వాడా చిన్నవాడు. ఒకవంక కోర్టు వ్యవహారాలు, మరోవంక సంసారం చూసుకోవాలి,

ఇన్నింటిమధ్య వాడికి చదువుకోవాలని వూహా రావడమే మంచిది కాదంటారా?— వచ్చి నప్పుడు సమర్ధులూ, పెద్దవాళ్లూమీరు దగ్గరవుండి ఏమీ చేయకుండా చూస్తూ వూరుకొంటారా?"

ఆడది కంటినీరు పెట్టడం ఎంతలావు మగ మనిషినైనా ఇట్టే ద్రవీభవింప జేస్తుంది. ఆ కంటినీరు ప్రేమకోసంకావచ్చు. కోపంచేత కావచ్చు. తన నిస్సహాయత తెలిసిన జ్ఞానంచేత కావచ్చు. మోసపు కన్నీరుకావచ్చు. ఏ కన్నీరయినప్పటికీ, మగవాడి గుండెమాత్రం ఆకట్టక తప్పదు. జమదగ్నికి తెలిసినంతలో శారదాంబకు కన్నీరు పెట్టవలసినంతటి బల హీనస్థితి ఎన్నడూ కలగలేదు. అంతగా తన మనసుకు నచ్చని పరిస్థితి ఏదైనా జరిగి నపుడు, మవునంగా వూరుకొనేది. భరింపరాని ఆ మవునమే అవతలి వ్యక్తిని దారికి తీసు కొచ్చేది. ఇప్పుడు గోవిందమ్మ కన్నీరు పెట్టడం, జమదగ్నికి అనుభూతంగాఉన్నది ఆయన సరే అనే వరకూ ఆ కన్నీరు ఆగేట్లు లేదు. పైగా జమదగ్ని, ఆలోచనకు అవ కాశం ఇయ్యని స్థితి.

"అట్లాగేనండీ! అల్లుడుగారిని చదివించే భారం నాది."

గోవిందమ్మ కళ్లలో విజయహాసం పీఠం వేసుకుంది "ముహూర్తానికి ఏటి సూతకం అడ్డొస్తుంది. మనం ఇట్లాగు అని అను కుంటే, ఇహ దానికి తిరుగేమి వుంటుంది?" అంతవరకూ ప్రక్కనేవుండి, సాక్షీభూతంగా అంతా వింటున్న వీరభద్రం అప్పుడు కల్పించు కున్నాడు.

"మొదటి సంవత్సరం యమ్. ఏ. కు ఎంత తక్కువగా అంచనా వేసుకున్నా మూడు వేలు దాటుతుంది. మామగారూ ఈరోజుల్లో, అంత మొత్తం ఒకేసారి ఇస్తేరా, బ్యాంకులో వేసుకుని అవసరం వచ్చినప్పుడు తగ్గట్టు ఖర్చుపెట్టుకుంటూంటాము. లేదూ, ఏనెలకు ఆనెల పంపిస్తానంటారా, ఆబాధ్యతా మీదే!"

"నెల నెలా ఎందుకురా?—అది ఆయ నకూ చికాకు, నీకూ ఇబ్బంది!" గోవిం దమ్మ అందుకుంది. "కావలసిన డబ్బేదో ముందే ఇస్తారు. పట్టుకుపోయి వాడుకో! చాలకపోతే అప్పుడు మళ్లీ రాయొచ్చు" జమ దగ్ని దానికీ ఒప్పుకున్నాడు యాంత్రికంగా. బయటకు వచ్చేసింతర్వాతగానీ తను దిగ బడిపోయిన వూబి సంగతి ఆయనకు తెలిసి రాలేదు. రోటిలో తల దూర్చి రోకటి పోటుకు వెరవడం ఎందుకు?—అని ఆయ నకు ఆయనవే ధైర్యం చెప్పుకోవలసివచ్చింది.

ఇంట్లోమాత్రం శారదాంబ దగ్గర్నుంచి పెద్ద ప్రతిఘటనే ఎదురైంది. అసలా సంబంధమే అంతగా ఆమెకు మనస్కరించ లేదు. ఆకారణంగానే ఆమె ముభావంగానే వుంటూ వచ్చింది. రెండు మూడువేలు ముందస్తుగా వాళ్లకు ఇచ్చి గావాలన్నప్పుడు మాత్రం ఇహ ఆమె తనను తాను నిగ్ర హించుకోలేకపోయింది. భర్త మొహంలోకి సూటిగాచూస్తూ అడిగింది.

"అబ్బాయికి మీరెంత కట్నం పుచ్చు కొంటున్నారూ?"

జమదగ్ని దగ్గరనుంచి సమాధానంరాలేదు.

"కట్నం డబ్బు ఎదురిచ్చి, సంబంధం ఎక్కడ తప్పిపోతుందోనని ఖంగారు పడవలసి నంతటి ఉత్తమమైన సంబంధమా ఇది? ఆస్తిపాస్తులా?—గుణ గణాలా? చదువు సంధ్యలా?—ఏమిటి మిమ్మల్ని అంతగా మురి పించింది?"

జమదగ్ని మెల్లగా అన్నాడు. "ఆ కుర్ర వాడు నాకు నచ్చాడు. అతని అణకువా, ఆ తెలివి తేటలూ, చదువుమీద అతని శ్రద్ధా. అందుకే సంబంధం ఖాయం చేసుకుని, ఆ డబ్బు, ఈ సంవత్సరం అతను యింక చదవడానికి అయ్యే డబ్బు, అతనికి ముంద స్తుగా ఇస్తానని మాట ఇచ్చి వచ్చాను."

శారదాంబ ఇహ మాట్లాడడం అనవ సరం అనుకొని, అక్కడినుంచి లేచి అవత లికి వెళ్లిపోయింది. డబ్బు సర్దుబాటు చేయటం ఎలాగా అన్నది, అతని సమస్యగా పరిణమించింది. చలపతిని అడుగుదామని వెళ్లాడు. సంగతి సందర్భాలు తెలుసుకున్న చలపతికి కూడా, ఆయన చేసిన పని సబ బైనదిగా అన్పించలేదు. పైగా తనే, జమ దగ్నిని డబ్బు అడిగాడు.

"చేతో నాట్లు పూర్తయిపోయాయి. నిన్నా మొన్నట్లోనే కుంటికోటప్పకూ, వాళ్లకూ డబ్బు సర్దుబాటు చేయాల్సింది. మీరు కనిపించకపోతిరి! కుంటలు తవ్వించ డానికి, వట్టెలు పెట్టించడానికి, నారు పోయించడానికి ఇదిగో లెక్క వేశాను. పది హేను వందల తొంబయితొమ్మిది రూపా యిలా, అరవై ఎనిమిది నయాపైస లయింది" అంటూ లేచి లెక్క రాసే పుస్తకం తెచ్చి ఇవ్వబోయాడు. జమదగ్ని చేతు అడ్డం పెడుతూ, "నాకా లెక్కలతో ఏం పని? ఎన్నడైనా అడిగానా? ఏవిటి ఇవ్వాళ అందరి ప్రవర్తనా అదో వింతగా వుంది. అందరి సమస్యలూ నావే! నా సమ స్యల్ని మాత్రం ఒక్కడూ పట్టించుకోడు" అంటూ తలపట్టుకు కూచుండిపోయాడు.

చలపతి మెల్లగా లేచివచ్చి, అన్నగారి భుజంమీద చేతులు వేశాడు. "మీ సమస్య లకు పరిష్కారమార్గం చెప్పనా?" అని అడిగాడు ఎంతో సౌమ్యంగా.

జమదగ్ని ఆశగా చలపతి వేపు చూశాడు "కళ్యాణి పెళ్లి విషయం ప్రస్తుతానికి వాయిదా వేయండి. మనకు అన్నీ సమ



"చెలవలికి ఇయ్యాలి!" జమదగ్నికి మాట పడబడింది.

"మనం, పిల్లకు ఏ ఇరవై ముప్పై కులాల బంగారమన్నా పెట్టాలి. దానికి ఇది సరిపోదు."

"ఒకటి రెండు రోజుల్లో ఆ డబ్బు నేను సర్దుబాటు చేస్తాను. ముందీ పబ్బం గడుపు." శారదాంబ మరొక్కమాట అన లేదు. డబ్బు వున్న వెండివళ్లెం ఆయన ముందుకు తోసి, లేచి లోపలకు వెళ్ల బోయింది. అట్లా మాటా పలుకు లేకుండా వెళ్లిపోవడం, బాధాకరమనిపిం చింది జమదగ్నికి. ఆయన, తనను నలు గురిలో పట్టుకు తిట్టినా అంత అవమాన పడేవాడుకాడు. వెళ్లిపోతున్న భార్యను ఉద్దేశించి, కొంచెం కటువుగా అన్నాడు. "ఏమిటి నీ ఉద్దేశ్యం? ఇదంతా నేనే మింగే స్తున్నాననా?—" శారదాంబ గిరుక్కున వెనక్కు తిరిగింది. పెదవి విరిచింది. పేలవమైన నవ్వు ఆ పెదిమలపై. కంటి కొనల నుండి చూసింది. ఆ నొసలతో తిరస్కారం. వెక్కిరింపుగా అన్నది. "సమ యానికి వర్ద లేకపోతే, మన గౌరవాలు మంట కల్సిపోతాయి! అది గుర్తుంచుకోండి."

"నేనేం అంత మూర్ఖుణ్ని కాను!"

విసురుగా బయటికి వచ్చాడు. అక్కడో కుర్రవాడు చీటీ పుచ్చుకు నిలబడ్డాడు. "వీరభద్రంగారు పంపించారండీ! మీరి వ్వాళొచ్చి మాట్లాడతానన్నారుట కదూ?" ఆ కుర్రవాణ్ని అక్కడే వుండమని, అదే ఆవేశంతో జమదగ్ని కల్యాణి దగ్గరకు వెళ్లాడు. "తల్లీ! ఒక్క నీ నెక్లెస్ ఇయ్యి తల్లీ. ఇప్పటికే నా దగ్గర అరువంద లున్నాయి. అదీ ఇదీ కలిపి ఓ వెయ్యి అవుతాయి. ఆయనకు బయానాగా ఇచ్చి, నలుగురి చేతా 'తథాస్తు' అనిపించుకుని వస్తాను." కల్యాణి, తన మెడనుంచి నెక్లెస్ తీసి ఇచ్చేసింది. ఇచ్చేస్తుండగా, "అమ్మకు తెలియనీయకు సుమా!" అన్నాడు హెచ్చరి కగా జమదగ్ని. "అట్లాగే నాన్నగారూ!" అన్నది కల్యాణి. 'అట్లాగే' అన్న ఆ మాటలో ఒకటికి మించిన అర్థాలు. జమదగ్ని, చెల వలికి ఇవ్వవలసిన సొమ్ము ఇచ్చేసి, మిగిలిన సొమ్ము జాగ్రత్త చేసుకుని, జేబులో నెక్లెస్ వుందో లేదో సరి చూసుకుని, ఆ కుర్రవాడితో కలిసి, వీరభద్రం ఇంటివైపుగా నడుస్తూ, మధ్యదారిలో, "నువ్వు నడుస్తూవుండు. నే నిప్పుడే వస్తాను" అంటూ మార్వాడీ కొట్టువైపుగా నడిచాడు.

# వీణ కథ

— జొష్టర్

ఈనాడు మనము చూచే వీణ అనాది వాద్యముకాదు. తొలి రోజుల వీణ పొడుగు ఆనపకాయ బుర్రా, బోలు వెదురుగొట్టమూ ఏడు తీగెలతో ఉండేది కాబోలని క్రీస్తుశక ప్రారంభపు శిల్పములను గమనిస్తే బోధ పడుతుంది. క్రీ. పూ. 150 సంవత్సర ప్రాంతపు బార్హుతు శిల్పాలలో పటములో చూపబడిన వీణ కానవస్తుంది. ఒక శిల్ప



ములో (వేణీమాధవ బారువా "బార్హుతు శిల్పము" చూడండి) ఒకడు వీణ వాయిస్తూవుంటే ఏనుగు ఒకటి వస్తూన్నట్లు శిల్పించబడినది. ఇది వత్సరాజు కథా చిత్రము కావచ్చును. బుద్ధగయ శిల్పాలు పైవాటి కంటె ప్రాచీనములు కావని, వాటి వికాసము సూచిస్తుంది. బుద్ధగయలోనూ ఇలాటి వీణయే కనబడుతూన్నది. ఈ తీగెలను కొమ్ముతో మీటి వాయించేవారని శిల్పములలోనేకాక శాలివాహన సప్తశతి పద్యాలలో ఒకదానినిబట్టి తెలుస్తుంది. గేదెను దోమలు కుట్టుతున్నాయట. అది కొమ్ముతో కొట్టితే ఝంయిమన్న నాదము వీణను జ్ఞాపకానికి తెచ్చిందట. శాలివాహన సప్తశతి పోలునిదట. అతడు ఎంత లాగుకు వచ్చినా క్రీ. శ. మూడో శతాబ్దానికి ఇటు వైపు రాడు.

అమరావతి, నాగార్జునకొండ, గోళీ, శిల్ప ఫలకాల కొనన వైణికురాలి చేతి వీణా, ఇంద్రునితో వచ్చి వాయించే పంచశిఖుని చేతిలోనూ, ఇలాటి వీణే కనబడుతోంది. అంటే భారత దేశమంతటా ఈ రకపు హార్ప్‌వంటి వీణయే వాడుకలో ఉండేది సముద్రగుప్తుడు సంగీతజ్ఞుడు. తన నాణె ములమీద తాను నాలుగు కాళ్ల బల్లమీద కూర్చుని వీణ వాయిస్తున్న అర్ధశిల్పాన్ని ముద్రింపించాడు. (ఇదైనా గమనించని చిత్ర కారు లొకరు నాటి సముద్రగుప్తుని చేతు లలో ఈనాటి వీణను అమర్చినారు.) ఆ వీణ కూడా పై వీణ ఆకారములోనే ఉన్నది. మద్రాసు మ్యూజియములో "బర్మాదేశపు వీణ" అన్న పేరుతో ఈ రకపు వీణయొక్క నిండు రూపము కనబడుతున్నది. తొలి రోజుల సంగీత గ్రంథాలలో ఈ వీణకు అన్వయముగా వర్ణన లుండునేమో పరిశోధించాలి.

గ్రీకు శిల్పానికీ, భారతీయ శిల్పానికీ బల హీన మేళము గాంధార శిల్పము. క్రీస్తు శకము నాలుగో శతాబ్దం దాకా తక్షశిల వంటి ఉత్తర భారత విద్యా కేంద్రాలలో వెలిసింది ఈ శిల్పము. ఈ శిల్పంలో ముందు వర్ణించబోయే బేంజోలాటి వీణ కనిపిస్తుంది. భారతదేశపు తొలి వీణ 'లైర్' అన్న గ్రీకు తంత్రీ వాద్య అనుకర ణము కాకపోవచ్చునుగాని ఈ బేంజో వీణ గ్రీకు వాద్యానుకరణమే సవాలి.



అజంతా వర్ణ చిత్రములు ఏడవ శతాబ్దాంతానికి కాబోలు పూర్తి అయాయి అంటారు. ఆ చిత్రములలో బోధిసత్త్వ పద్మపాణి చిత్రముపైన బేంజోలాటి వీణె (యే కాబోలు) కనిపిస్తూన్నది. దీని తీగలను వ్రేలితోమీటి, పొడవును దిగువన వ్రేలితో ఫిడేలునువలె నడిపి వాయించేవారు కాబోలు. ఫిడేలుకువలె (విల్లు) లేదుమరి! ఈరకపు వీణెయే జావా ద్వీపములోఉన్న బొరాబొదూరు కాద్ద స్తూపమునకు అతికించిన రాతి పలకల పైని ఉన్న అర్ధ శిల్పాలలో కనబడుతున్నది. (Krom; Series 0, PL XVI) దీనితో ఈనాటి వీణకు రూపు తేలుతున్న దనిపిస్తుంది. (రెండోబొమ్మ జావా వీణ కాబోలు చిత్రముగా ఉంది.) అలాటి వీణెయే



కళింగ దేశానికి రాజధాని ముఖలింగ నగరపు దేవాలయపు గూటి సరస్వతి చేతిలోవుంది (కళింగ సంచిక చూడండి) ఇది ఈనాటి వీణకు తొలి రూపమని అనవచ్చును. దీనిలో తీగలు ఒకదానిపక్కన ఒకటి,— ప్రాచీన వీణకు వలె— ఒక దానిపైన నిచ్చెన మెట్లువలె ఇంకొకటి కాదు. ముఖ లింగ ఆలయాలు తొమ్మిదీ పదీ శతాబ్దాల నాటివి కనుక అజంతాలో కనిపించే బేంజో రకపు వీణ మధ్య భారతములోనైనా ఎనిమిదీ తొమ్మిదీ, పదీ శతాబ్దాలలో వాడుకలో ఉండేదన్న మాట. అక్కడినుండే జావాకి వెళ్లియుండవచ్చును.

అజంతాలోనే 17వ గుహలోని గాయక బృందములో ఒకరు క్రింది పటములోని వీణ వంటిది పట్టినారు. అది ఏకతార అని నేనను



కోలేను. ఏమంటారా? 16వ శతాబ్దపు లేపాక్షి శిల్పాలలో తుంబురుడిలాటి వీణను పట్టినాడు. కాకతీయుల కాలపు—అనగా పద మూడవ శతాబ్దపు అయినవోలు సరస్వతి ఇలాటి వీణను పట్టినది. వీణె రకాలలో ఇది ఒకటి.

రాజస్థానపు వర్ణ చిత్రాలలో ఈరకపు వీణ తరచు కనిపిస్తుంది. దీనికి కాయలు రెండు. 'వరూధిని' వాయించిన వీణ—మేళ



వీణ—ఇదే నంటాను. మెట్లు సర్ది కొన్ని స్వరాలు పలికేటట్లు ఏర్పాటు చేసుకుని ఆ కాలంలో వాయించేవారు. నందితిమ్మనగారి నారదుడు 'మేళవించిన' మహతి భుజానికి —'మా ం స లా ం స ం బు వ' అని కదా అన్నాడూ—తగిలించేది ఒంటికాయ వీణే నంటాను, ఇందాకటి రకం.

ఇక అచ్యుత దేవరాయలో, రఘునాథ రాయలో, గోవింద దీక్షితులో, రామామాత్యులో చేయివేసి రూపొందించిన వీణ ఈనాటి వీణ. వీణ సరస్వతి రూపమే అన్నది అంతగా పొందదేమోనంటాను.

ఇక రక రకాల వీణలు—పాల్కురికి కాబోలు పట్టిక వేసినవి—తుంబయొక్క ఆకారాన్నిబట్టి కచ్ఛపి ఇత్యాది నామాలు పొందినవేమోనని వూహ. పెట్టెలవలె మూలలతో ఉండిన వీణలూ కనిపిస్తాయి శిల్పా



# శిరోజాలంకరణ

బన్ ముడి (1వ బొమ్మ)



బన్ ముడి (2వ బొమ్మ)



బన్ ముడి (3వ బొమ్మ)

మారుతున్న యుగంలో, శిరోజాలంకరణలో కూడా రకరకాల మార్పులు వస్తున్నాయి. ఈ మార్పులు 'వనితాలోకం' మీద మంచి ప్రభావాన్నే ప్రసరిస్తున్నాయి.

## బన్ ముడి

ఇది కొంచెం 'బన్' రొట్టెలాగ కనిపిస్తుంది. కాబట్టి ఈ పేరు వచ్చింది. ఈ రకం శిరోజాలంకరణ మద్రాసు కాలేజీలలో లేటెస్ట్ ఫాషన్‌గా ఉందంటారు. దీనిని వెయ్యటం చాలా తేలిక. ఏ రకం పిన్నులనయినా వాడవచ్చు. పొట్టి కేశాలున్నవారు కూడా దీనిని వేసుకోవచ్చు.

ఇక వేసే పద్ధతి :

1వ బొమ్మలో చూపించిన [illegible]ంగా జుట్టుని చిక్కులు లేకుండా దువ్వుకోవాలి.

2వ బొమ్మలో చూపించినట్లు క్రర (లేక ఏదయినా గుండ్రని క్రర ముక్క)తో 'చుట్ట'గా వెనక్కి చుట్టాలి.

ఆ తర్వాత 3వ బొమ్మలోలాగ పిన్నులుపెట్టి బంధించటం అవసరం.

ఇక 4 వ బొమ్మలో సూచించినట్లు వెనుకభాగం వెంట్రుకలనీ రూళ్లకర్ర సహాయంతో ముందుకి చుట్టలాగచుట్టి కుడి, లేక ఎడం పక్కకి తీసి పిన్నులు పెట్టాలి. ఇప్పుడు పైనుంచి 'బన్'లాగా కనిపించే ఈముడి క్రిందనుంచి రొట్టె లాగ కనిపిస్తుంది. దీనికీ పేరు ఎలా వచ్చిందో ఇప్పుడర్థం అవుతుంది

ఈ ముడిలో ఎటువంటి పువ్వులు

ఫొటోలు, సేక



# గొడుగుముడి



గొడుగుముడి (4వ బొమ్మ)

గొడుగుముడి కన్నడదేశంలో మంచి ప్రసిద్ధి చెందింది. మైసూరు, బెంగుళూరులలో అన్ని వయసుల ఆడవారు ఈ శిరోజాలంకరణ వాడ్తారు.

**వేసే విధానం :**

1వ బొమ్మలో చూపిన విధంగా శిరోజాలని చక్కగా, చిక్కులులేకుండా దువ్వి, ముంగురులని ఇష్టం వచ్చినట్లు అలంకరించుకుని, తర్వాత చిత్రంలో ప … నాలుగు పాయలుగా రిబ్బన్‌తో గాని, నల్లటి దారంతో గాని కట్టాలి. ఆపైన తలకి రెండుపక్కలా రెండు పాయలు రెండు చెవులమీదుగామా వెనక్కి తీసుకొని 3వ బొమ్మలో చూపించినట్లు ముడివేసుకోవాలి.

4వ బొమ్మలో జుట్టుని వేళ్లకి ఎలా చుట్టుకుని అమర్చుకోవాలో కనిపిస్తుంది. ఈ 'దశ' లో గొడుకు ఆకారం రావాలి. అందుకనే పేరు 'గొడుగుముడి'. గులాబి, లేక రంగు రిబ్బన్ మంచి ఆకర్షణ. ●

*'శిరోజాలంకరణ' లాంటి విస్తృతమైన 'అంశం' క్రింద ఎన్నో రకాల అలంకరణలను గురించి చెప్పుకోవచ్చు. ఈ పేజీలలో జిన్ ముడి (ఎడమవైపు పేజీ), గొడుగు ముడి (కుడివైపు పేజీ)లను గురించి తెలుసుకోవచ్చును.*



గొడుగుముడి (2వ బొమ్మ)



గొడుగుముడి (3వ బొమ్మ)

రచన: ప్రభాకర్



# శిరోజాలంకరణ

కుంటే పదమూడు మరియు పదిహేడు సంవత్సరాల మధ్యకాలం పఠనాశక్తికి "ఉత్తమ కాలమని" చెప్పవచ్చును.

## పఠనాసక్తిలో వచ్చిన అంశములు:

వ్యక్తిగత విభేదాలున్నప్పటికీ, యువతీ యువకుల నిర్ధారిత యవ్వనదశలో ఆకర్షించే పరనాంశాలు కొన్ని ఉన్నాయి. పత్రికలలో భాగములుగా ప్రచురితము చేయబడు సాహస కృత్యములతో కూడిన కొన్నికథలు చదవడంతో, చెప్పుకోదగ్గ అభిరుచి పన్నెండు సంవత్సరాల బాలురలో అగుపించదు. అయినప్పటికి సాహసము, రహస్యము, హాస్యము, నూతన కల్పితములతోనే సీరియల్ కథలు ప్రచురిత మవుతాయి. ఇవే కాకుండా సీరియల్‌గా ప్రచురించే కథల్లో చరిత్ర, జీవిత విశేషములను తెలుపు స్వీయ చరిత్రలు కూడా ప్రసిద్ధములైనవి. సాధారణంగా పదిహేనవయేటినుంచే యువకులు ఒకందుకు ప్రత్యేకముగా ఉద్దేశింపబడిన సాంకేతికమైన పుస్తకాలను అత్యభిరుచితో చదువనారంభిస్తారు. పదహారవ ఏట వర్తమానపు సంగతులు, సమాచారములు, ఆటలపై అభిరుచి పెరుగుతుంది పది, పదకొండు తరగతుల విద్యార్థులలో పఠనాసక్తిలో కొంచెం మార్పు కల్గుతుంది వారు ముఖ్య విషయాలనే అతి జాగ్రత్తగ చదువుతారు. మిగతా భాగాన్ని వదిలేస్తారు ఎప్పుడైతే బాలికలకు పన్నెండు పదిహేను సంవత్సరాలు నిండుతాయో అప్పుడు వారికి గంధర్వకథలు, అసత్యము లేదా టక్కుయిన కథలపై అభిరుచి తగ్గుతుంది. వారికి యిప్పుడు కావలసినవి భావ ప్రేరితము, అద్భుతము, కల్పితములైన కథలు మాత్రమే. అవికూడా పరిపక్వమైన కథలుగా వుండాలి. ఆశ్చర్యము, శృంగారము, కరుణ రసాత్మకములైనవి ఒక విధంగా వారిని ఎక్కువగా ఆకర్షిస్తాయి. చారిత్రాత్మకములైన నవలలు స్వభావసిద్ధంగా వుంటే చదివి ఆనందిస్తారు యువతులకు కట్టుకథలు, పాటలు పద్యాలు చదవాలన్న కుతూహలం, ఉత్సాహం బాగా వుంటుంది. యింకను కథల్లో ముఖ్యమైన ఆకర్షణ శైలి కాబట్టి వాళ్ల ఆత్మలు కథల్లో లీనమవుతాయి. ఉన్నత పాఠశాల యువతులు సాధారణంగా గత పూర్వ కాలానికి చెందిన "సెంటిమెంటల్" కవులనే చదవడానికి ఇష్టపడుతారు. కాని కళాశాలల్లో ప్రవేశించిన కవులనే చదువుతారు. అపరాధపరిశోధన, హాస్యము, శృంగారములకు సంబంధించినవి చదవడమనేది యువతులలో సర్వ సామాన్యమైన అభిరుచులే. ఎందుకంటే క్రమక్రమంగా యువతులు శారీరకంగాను, మానసికంగానూ, మార్పు చెందడంవల్ల శృంగారం చదవడం ఎక్కువవుతుంది. కాని వారు చదివే ఎక్కువభాగం పనికిరాని చెత్త. వాస్తవానికి దగ్గరగా వుండేవికూడా కావు.

## వార్తాపత్రికలు

వార్తా పత్రికల్లో సాధారణంగా చతుర్దశం మధ్య ప్రచురించే విచిత్రవార్తలు చదవడమనేది బాల్యదశతో ఆరంభమవుతుందని కొందరు మనస్తత్వ శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడ్డారు. సాధారణంగా విచిత్ర వార్తలు చదవడమనే ఆసక్తి అట్టే చాలా కాలముండదు. తర్వాత యువకుడు విమర్శనాత్మకములైన వ్యాసములను, సాంఘిక ప్రవర్తనగురించి బాగా చదువుతాడు. ఉన్నత పాఠశాల విద్యార్థులకు బాగావచ్చిన భాగములు కామిక్సు తర్వాత క్రీడారంగమనే చెప్పవచ్చును. తరచుగా యువతులు మాత్రం వంటలూ—వార్తలు, కుట్టుడిజైన్లు, (ఉంటే)సొసైటీ పేజీని చదువుతారు. ఇప్పుడు యువకునిది విశాలదృష్టి ఇప్పుడతనికి— సమాజమందు మరియు ప్రపంచ రాజకీయాలపై అభిరుచి పెరుగుతూ వుంటుంది. కామిక్సుపై ముందున్నంతగా అభిరుచి ఉండక చాలావరకు తగ్గుతుంది. పత్రికలలోని చాలా సీరియస్ భాగములనే చదువుతాడు. ఇంకా చదవటానికి ఎక్కువ సమయాన్ని వెచ్చిస్తాడు. దాదాపు నూటికి డెబ్భైమంది యువకులు రోజుకి గంటన్నర, మిగతా ముప్ఫైమంది గంట సమయాన్ని మాత్రమే పేపరు చదవడానికి వినియోగిస్తారు. మరికొందరు యువకులు పత్రికలోని ప్రతి పేజీ లేదా పత్రిక ఆసాంతం చదువుతారు. వారి పత్రికా పఠనంతో అభివృద్ధి మాత్రం అగుపిస్తుంది. ఇదేకాకుండా వారు పెరిగిన కొలది చదివే రచనస్థాయిలో కూడా అభివృద్ధి వస్తుంది. ఇది బుద్ధి శక్తి అధికంగా వున్న యువకుల్లో చాలావరకు నిజమవుతుంది.

## పత్రికలలో ఎంచుకొనే భాగాలు

చాలామంది యువకులు సమాచారములు తెలుసుకోవాలన్న దృక్పథంతో వార్తా పత్రికలను చదువుతారు. మరికొందరు మాత్రం సమయాన్ని గడపటానికని చదువుతారు. అయినప్పటికీ పత్రికలు చదవడమనే అభిరుచి యువతీ యువకుల్లో ఒకేతీరుగా ఉండక కొద్ది మార్పు అగుపిస్తుంది. వార్తా పత్రికలలోని వివిధాంశాలపై ఆసక్తి కలగటానికి దేశకాల పరిస్థితులు గొప్ప ప్రభావం వేస్తాయి. మనదేశము నేడు ఎదుర్కొంటున్న అనేక క్లిష్ట సమస్యలను గూర్చి వివరంగా దినపత్రికల ద్వారా తెలుసుకొనవీలగును. ఉదాహరణకు—పొరుగు దేశాలైన పాకిస్తాన్, చైనాలు నేటి మనదేశ సరిహద్దులపై ఇంకను ఉద్రిక్త స్థితిని కొనసాగిస్తూనే వున్నాయి. అయితే యిట్టి సమయంలో మనదేశం అనుసరిస్తున్న విధానాలన్నీ యువకులకు పత్రికల ద్వారానే తెలుస్తుంది. కాబట్టి విషయాన్ని చదివి తెలుసు



కుంటూ తమ రాజకీయ జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలని చూస్తుంటారు. సాధారణంగా దేశనాయకుల ఉపన్యాసములు, సందేశాలు పత్రికలలో ప్రచురిత మవుతాయి గనుక వాటిని ఆమూలాగ్రంగా చదువుతారు యుద్ధానికి సంబంధించిన వార్తలు, ఇంకనూ అంతర్జాతీయ బాధ్యతలు, రాజకీయ సాంఘిక సమస్యలు, క్రీడావార్తలు మున్నగు పత్రికలలోని భాగములను అతి జాగ్రత్తగా చదువుతారు. సర్వసాధారణముగా యువకు లను ప్రత్యేకముగా ఆకర్షించు భాగములు—కామిక్సు, క్రీడారంగం చిత్రవార్తలు, కథలూ సాంఘిక వార్తలూ, వారఫలాలు, క్రొత్త పుస్తకాలు యింకనూ వర్గీకృత ప్రకటనలని చెప్పవచ్చును. యువకులు పెద్దవాళ్లవు తున్నకొద్దీ మొదటి పేజీలోని కొన్ని అంశాలను చదవాలనే ఆకాంక్ష అధికంగా వుంటుంది. జాతీయ, అంతర్జాతీయ — వార్తలు సంపాదకీయాలూ, ఇంకను పత్రికలలో తాముచదివిన కథలూ, వ్యాసాలపై అభిప్రాయాలను తెల్పుతూ పత్రికా సంపాదకునికి ఉత్తరాలు రాస్తుంటారు. యిట్లా చదువరుల అభిప్రాయాలకై దినపత్రికల లోనే కాకుండా వార, పక్ష, మాస, త్రైమాస పత్రికలలో ప్రత్యేకమైన భాగాన్ని కేటాయించి—దానికి ఉత్తరాలు శీర్షిక అని పేరిడిరి. కాలమిస్టులచే వ్రాయబడిన కొన్ని విషయాలను వివరంగా చదువుతారు. పది హేడవపేట, కామిక్సు, నేరము — శిక్షా, ప్రమాద వార్తలపైనున్న అభిరుచి కొంచెం తగ్గుతుందనే చెప్పవచ్చును. ఇప్పుడు చెప్పుకో తగ్గ పెద్ద మార్పేమంటే కొందరు యువకులకు కొన్ని ప్రత్యేకపత్రికలపై నమ్మకముంటుంది. కాబట్టి వాటిని తప్ప మిగతా పత్రికలను చదవడాని కిష్టపడరు. యువతుల అభిరుచులలో ముఖ్యమైనది వనితావాణి, ముఖ్య ప్రకటనలు, ఫ్యాషన్సు, సంపాదకీయాలని చెప్పవచ్చును.

బాల్యంలో కేవలం పిల్లల పుస్తకాలు చదివినట్లు కాకుండా, యవ్వనదశలో వివిధ మాధ్యమములనుండి చదువుతారు

## పుస్తకాలు

యవ్వనదశలో పఠనా సమయం తక్కువైనప్పటికీ చాలా కొద్ది పుస్తకాలు, అవికూడా విరామ సమయంలో వినోదం కోసం చదువుతారు. ఉన్నత పాఠశాలలో సాధారణంగా యువకులు నెలకు మూడు, చురుకైన యువతులు నెలకు అయిదు పుస్తకాలు చదువుతారు. ఇంకా మందబుద్ధిగల యువతీ యువకులు అంతకన్నా తక్కువ పుస్తకాలు చదువుతారు. కాని వాళ్లకు సమయం చిక్కితే ఇంకా చాలా పుస్తకాలు చదవడాని కిష్టపడతారు. ప్రసిద్ధ రచయితలచే వ్రాయబడిన కల్పిత కథలతో కూడుకొన్న పుస్తకాలయితేనే యువకులు చదువుతారు.

యిలా యువకులలో గ్రంథపఠనం పట్ల ఆసక్తి నానాటికీ చెప్పుకోదగినంతగా పెరుగుతున్నదేగాని తరగడం లేదు. యిట్లా యువకుల పఠనాసక్తికి పత్రికలు పుస్తకాలు విశేషముగా దోహద మొనగూర్చు చున్నవనటంలో సంశయ మేమీ లేదు. ఈ విధముగా చూపినచో పత్రికలు, పుస్తకాలూ యువకుల పఠనాసక్తికీ, అభ్యున్నతికీ జయ పతాకములని చెప్పవచ్చును.

—ఆర్. వెంకటరెడ్డి ●



వేలకొలది హృదయాలు ఒక్కటిగా స్పందిస్తున్నాయి
చిన్న చిన్న వాగులు సాగర గర్భంలోకి ప్రవహిస్తున్నాయి.

విభిన్న జాతులతో కూడిన నేటి మన సంఘం కూడా యిలాగే ఉంది. ఈ మన సంఘం స్వాతంత్ర్యాన్ని గలిగి ఉండి శాంతి సౌజన్యాలతో జీవిస్తోంది. ఈ సంఘముకోసం పాటుబడి పోరాడటం, నిలబెట్టడం అవసరం. జ్ఞాపకముంచుకోండి. ఈ సంఘానికి మీరెంత ప్రధానమో మీ పొరుగువారు కూడా అంత ప్రధానమే.

# భారతదేశం ఒక్కటే
# భారత జాతి ఒక్కటే

DA-65/74

# ఆంగ్ల తారాపథం..3

## అవాగార్డ్‌నర్

వాతావరణం ప్రశాంతంగా ఉంది విరామము లేకుండా స్టూడియోలో పనిచేసిన సాంకేతికులందరూ విశ్రాంతికోసం అలా వెళ్ళారు అక్కడ మిగిలింది నేనొక్కడనే !

వరండాలో యీజీచైర్‌లో కూర్చున్నాను రేపటి కార్యక్రమం గురించి ఆలోచిస్తున్నాను ఇంతలో ఉన్నట్టుండి నా ఆలోచనలకు అంతరాయం కలిగింది తీరా చూసేసరికి, అప్పుడే 'బాత్‌రూం'లో నుంచి వస్తున్న అవాగార్డ్‌నర్ కనిపించింది

అవాగార్డ్‌నర్ అందమైన నటి మా దేశంలో పేరుప్రఖ్యాతులను అంచలంచెలుగా సంపాదించుకొంటున్న యీ నటి ఎంతో విచిత్రమైన వ్యక్తి !

తన్ను చూడగానే నవ్వింది

'హలో !'

'రిక్, హలో !'

ఆ సమయంలో అవాగార్డ్‌నర్ మామూలు మనిషిగా కనిపించలేదు మ్యూజియంలో ఉండే విగ్రహంలా ఉందామె ! (అనాగరికం కాదు సుమా !)

గ్రీకు దేవతలు ఎంతో అందమైనవారని వినికిడి వీరిని గురించి కథలు కూడా చెప్పుకునేవాళ్ళం, మా చిన్నతనంలో గ్రీకుదేవతలెవ్వరినీ కళ్ళారా చూడకపోయినా, అవాగార్డ్‌నర్‌ను చూచాక, యీమె గ్రీకు దేవతలా ఉందనిపించింది నాకు

నా ప్రక్కనే జాలీ కూడా ఉంది ఆ, అన్నట్టు జాలీ అంటే నా భార్య ! అవాగార్డ్‌నర్ అందచందాలు జాలీకి కూడా ఆశ్చర్యాన్ని కలిగించాయి పాలరాతి విగ్రహంలా ఉందట గార్డ్‌నర్ అంత అందమైన నటిని తానెన్నడూ చూడలేదని మా జాలీ యిప్పటికీ చెపుతుంది నాతో

అందం మగవాళ్లను మాత్రమే మరిపించటం న్యాయం కాని, ఆడవాళ్లను కూడా మరిపించే సుందరాంగులు మైగాడ్ నిజంగా అపురూపలే

అంతటి అందమైన అవాగార్డ్‌నర్‌లో ప్రేమతోపాటు కక్ష, అనురాగంతోబాటు ఆవేశం సమపాళ్లలో ఉన్నాయి ఒకరకంగా



ఆమెను మించిన ప్రియురాలు కనిపించదు కాని కథ అడ్డంతిరిగితే డేంజర్ !

ఎందుకో, ఎప్పుడు చూచినా ఆమెలో అసంతృప్తి, అయిష్టత గూళ్ళు కట్టుకొని ఉండెవి ఏదో పోగొట్టుకొన్న వ్యక్తిలా ఉంటూ, నిర్జీవమైన చిరునవ్వుతో జీవనం చేస్తుండేది

స్పెయిన్‌లో ఏదో పిక్చర్‌లో పనిచేస్తూ యిద్దరం కలిశాం అప్పుడే యీమె ఎంతో చిత్రమైన మనిషి అనిపించింది నాకు

అవా ఎప్పుడో ఏదో దిగులుతో ఉండేది కాదు నిద్ర మాత్రలు ఎప్పుడూ తన దగ్గర ఉంచుకొనేది దానికి కారణం తరువాత తెలిసింది ఆమెకు ఫ్రాంక్ సినాట్రా అంటే వల్లమాలిన ప్రేమని !

హాలివుడ్‌లో ఉండే ఫ్రాంక్‌తో ఆమె ప్రతి రోజూ టెలిఫోన్‌లో మాట్లాడుతూ ఉండేది అందుకే, ఏదయినా సందర్భం వచ్చినప్పుడు ఫ్రాంక్ ప్రస్తావన వస్తే, ఆమె తన్ను తాను మరిచిపోయేది

ఒకరోజున స్టూడియోలో పని పూర్తయింది నేనూ, గార్డ్‌నర్ కలిసి అక్కడికి దగ్గరలో ఉండే స్పానిష్ హోటల్‌కెళ్ళాం అక్కడే ఉన్న లౌడ్‌స్పీకర్‌లో అకస్మాత్తుగా 'ఫ్రాంక్' పాట వినిపించింది ఆయనే పాడారది "ఐఫాల్ ఇన్ లవ్ టూ యీసిలీ" అనే పాట విన్న ఆమె కన్నులు ఆనందంతో మెరిసిపోయాయి "ఈ పాటంటే నాకెంతో యిష్టం ఐ లవ్ దిస్" అంటూ తన్ను తను మైమరచింది

ఆదేరికార్డు, ఫ్రాంక్ సంతకంతో మరో నాటి విమానంలో అవాకు చేరిపోయింది ఆరోజు రాత్రికే ఆమె, ఫ్రాంక్ సినాట్రాకు టెలిఫోన్‌చేసి, ఆ రికార్డు ఎంతో బావుందని చెప్పింది

తరువాత యిద్దరూ కలిశారు "ది బేర్‌ఫుట్ కాంటెసా" సినిమా తీసే రోజుల్లో ఇద్దరూ కలిసే ఉండేవారు వీలున్నప్పుడు వారితో కలిసి నేనూ లండన్ వెళ్లేవాణ్ణి కలిసే భోజనం చేసేవాళ్ళం తరువాత రెండు, మూడు 'నైట్ క్లబ్' లకు వెళ్లి ఆ రాత్రంతా గడిపేవాళ్లం అవా, ఫ్రాంక్‌లు కలిసి చేసే నృత్యం, చాలా బావుండేది దక్షిణ అమెరికా నుంచివచ్చిన ఆమె ఎంతో మంచిది ఆ లేత హృదయంలో లేత వలపులూ ఉండేవి

స్పెయిన్‌లో ఒకరోజు లక్కాడి .. 'రాజా' వారింటికి డాన్సు చూడటా.. కెళ్ళాం స్పెయిన్‌లో ఉండే పెద్ద డాన్సర్ ఒకరు ఆనాటికి వినోదాన్ని అందించారు మేం అతిథులం

ఆ డాన్సు చూచిన అవాగార్డ్‌నర్ బాగ కదిలిపోయింది తను కూడా డాన్సు చేయాలనే భావం కలిగింది వెంటనే, లేచి గంటసేపు డాన్సు చేసింది నిజంగా ఆశ్చర్యం వేసింది

ఆమె, ఫ్రాంక్‌మంచి స్నేహితులు కాని అనతి కాలానికే యిద్దరూ విడిపోయారు అది తలచుకొన్నప్పుడల్లా మాకు జాలి వేసేది ఆమెలాగా ఫ్రాంక్ కూడా యి

"నీ మనస్సే అంతో! అసలది ఏప్పుడు బావుందో చెప్పు వింటాను!"

హఠాత్తుగా ముకుందరావు "నా పెళ్ళానికి విడాకులు ఇవ్వాలని ఉంది" అన్నాడు.

ఆశ్చర్యంతో ఆనందరావు నోరంతా తెర 'డు?

"ఆమె చేసిన మహా నేరమేమిటో?"

"నా నోట మళ్ళీ వినాలని ఉందా?"

"అదంతా అనుమానం ముకుందం! కట్లో వెళుతూన్నప్పుడు తాటినైనా ముగా భ్రమించి అదిరిపడతాం. అది జంగా పాముకాదు. కేవలం మనస్సుచేసే ంద్రజాలం. అంతే! నీ మనస్సు విన్నో చవ నుచేసి ఆడిస్తోంది. ఆ దౌర్బల్యంతోనే న్ను నమ్ముకున్న కల్యాణికి అపకారం యాలని సిద్ధం అవుతున్నావు"

"నీ పంచతంత్రం, హితోపదేశం భద్రంగా చు! ఉత్తరోత్తరా ఉపయోగించవచ్చు!"

"మరి కోర్టు తంత్రం చెప్పనా!" అంటూ ఆనందరావు గలగల నవ్వాడు. అసలు నీ పెండ్లి ఎలా అయిందోయ్? పూలహారాలు మార్చుకోడంతో అయితే, అవి వాడగానే మనస్సులూ మారవచ్చు! పవిత్రమైన అగ్నిహోత్రం...."

"అదీ చల్లారి ఎన్నో ఏళ్లయింది" అంటూ కోపంగా ముకుందరావు కారును హఠాత్తుగా ఆపి బయటకు వచ్చాడు.

"పద! ఆ చల్లటి ఇసుకలో కూర్చుంటే నీ మనస్సూ చల్లపడుతుంది" అంటూ ఆనందరావు అడుగులువేస్తూ "ఇంతకూ ఏమంటావ్?"

"విడాకులు!" ముకుందరావు కోపంతో పిడికిళ్లు బిగించాడు.

"ఊఁ పద! ఇచ్చేదువుగానీ! దీని కెందు కింత రాద్ధాంతం! అయినా విడాకులతో నీకు శాంతి లభిస్తుందా? వేరు పడినంతమాత్రాన సమాజం ఆమెను చూపి, 'అదో ఆమె ముకుందరావు మాజీ భార్య!' అంటూ వేలెత్తి చూపినప్పుడు నీవు వినవూ, అది విన్నప్పుడు అయినా ఏక్కడో అంతరాంతరాల్లో బాధ కలిగించదూ? ముందు ఈ బాధోపశమనం గురించి ఆలోచించు. ప్రత్యేకంగా విడాకులవల్ల నీవు పొందబోయే నవనిధులూ, అమర భోగాలూ విడిగా చెప్పు వింటాను."

"విడాకుల తరువాత- అదంతా ఆలోచిస్తాను."

"కొత్త సమస్యలు కొని తెచ్చుకోడమవుతోంది. మరి నీవు పొందబోయే సుఖాలు భోగట్టా కూడా నీకు ఖచ్చితంగా తెలీనప్పుడు ఎందుకా దారి? కల్యాణి నీ ఆనందాలకూ, విలాసాలకూ ఎప్పుడూ అడ్డురాలేదు. నీ ఇంట్లో గోడకు తగిలించిన ఏ బొమ్మ నీ కెంతటి బాధనీయమైనదో, విలువైనదైనదో అంతే కల్యాణికి నీ జీవితంలో విలువ!" అంటూ ఆనందరావు భారంగా నిట్టూర్చాడు.

"మానసికంగా తేలిక పడతాను" అంటూ ముకుందరావు కండ్లు మూసుకున్నాడు.

"ఒక్కనాటికీ కాదు. అదంతా నీ భ్రమ."

"ఎటేనా వెళ్ళాలని ఉంది. ఎవ్వరూ గుర్తించని చోటికి బహుశా!"

"ఇదో కొత్త కోరిక!" అంటూ ఆనందం గంభీరంగానూ మ్లానంగానూ నవ్వాడు. స్థిరంలేని నీ మనస్సు నిన్ను అతి చిక్కుల్లో పెడుతోంది ముకుందం! కొంచెం మనస్సును సంభాళించుకో! కళ్లాలు మరీ వదులుగా విడచి పెట్టకు! అది ప్రమాదానికి దారి తీస్తుంది."

మరి వాళ్లిద్దరూ గంభీరంగా మాటామంతీ మరచిపోయి రెండు బండరాళ్లవలె కూర్చుండిపోయారు. సాయం సమీరాలు, నదీ జలాలమీదుగా చల్ల చల్లగా మృదువు మృదువుగా స్పృశిస్తున్నాయి. దూరాన రంగనాథాలయం గాలి గోపురమ్మీద వెలిగించిన కార్తీక దీపం మినుకు మినుకుమంటుంది.

హఠాత్తుగా ముకుందరావు లేచి, "హృదయంలో ఏదో వెలితి, ఎందుకో తపన! తాళ లేకుండా ఉన్నాను!" అన్నాడు.

ఆనందరావు మ్లానంగా నవ్వాడు.

* * *

ఆనందరావు ఇంకా సరిగ్గా నిద్ర లేవలేదు. తలుపులు దబదబ బాదుతున్న చప్పుళ్లకు లేవకుండా ఉండక తప్పలేదు. విసుగ్గా లేచివచ్చేసరికి ఎదురుగుండా చంద్రయ్య కనిపించాడు.

"ఏం? తెల్లవారిందా?"

"ఏం చెయ్యమంటారయ్యా? రాత్రి ఆనంగా వచ్చానా? దొరవారి దర్శనం ఇప్పుడయింది. అదీ నిద్రపోతూనే కండ్లన్నా తెరవకుండానే పోయి ఆనందానికి చెప్పుకో!" ఇదీ హుకుం! ఈ కొలువు ముందుకు వచ్చేది కాదయ్యా! ప్రాణం విసిగిపోతోంది. ఇదంతా నా ఇంటి కోసం? రేవు సంచులకొద్దీ ధాన్యం గోతాముల్లో దాచుకునేది నేనే!"

"ఇంతకూ అసలు సంగతి?" నిద్ర బాగా తేలిపోయిన తరువాత ఆనందం ప్రశ్న.

"ఇంకా ఏం సంగతయ్యా! ఇప్పటి వరకూ మడిలోకి నారు రాకపోతే—ఎప్పుడు ఏతలు కావాలి? ఎప్పుడీ పంట పండాలి?"

"దానికి నన్నేం చేయమంటావ్?" కోపంగానే అడిగాడు ఆనందరావు.

"డబ్బయ్యా! నారేతలకూ, కూలీలకూ డబ్బు కావాలా? పైసలు చేతిలో వెయ్యకుండా వ్యవసాయం చెయ్యమంటే నేనక్కడ ఎట్లా చస్తాననుకున్నారయ్యా?"

"ఓరె తలమనిషీ! తల పనిమాది ఉంది నీ వ్యవహారం. వయస్సు వచ్చింది. తలా, మీసం పండిపోయింది చంద్రయ్యా. ఏం లాభం!" అంటూ ఆనందరావు సిగరెట్ అంటించి విలాసంగా గాల్లోకి పొగ వదలి, తదేకంగా సుడులు చూడసాగాడు.

"అంటే?" ఆతడి నేత్రాలు కోపంతో జేవురించుకున్నాయి.

"చేతికింద అంత పొలం పెట్టుకుని, వ్యవహారం అంతా అజమాయిషీ చేస్తూ, డబ్బు పుట్టించలేకపోయావ్! పని జరుపుకుని ఇల్లు చేసానంటే ముకుందరావు కాదంటాడా? ఎంత అమాయకుడివి చంద్రయ్యా! చేతిలో డబ్బు లేకనే కదా వచ్చింది?"

"మొన్ననేగా ధాన్యం అమ్మింది. అంత డబ్బు..."

"ఎందోలే పెద్దవాళ్ల వ్యవహారం—నీకూ బాగా అకలవుతూందికదూ! పోయి ఏదేనా తిని ఆనకరా చూస్తాం!" అంటూ ఆనందరావు ఓ ఐదు రూపాయల కాగితం అందించాడు.

చంద్రయ్య తృప్తిగా వెళ్లిపోయాడు.

చంద్రయ్య అటు వెళ్ళాడో లేదో ఇటు ముకుందరావు తయారైనాడు.

"ఏం పొద్దున్నే వచ్చావ్?"

"యమదర్శనం అయింది."

"మరి నా దగ్గరకు వచ్చావేం?"

"ఇద్దరం కలిసి దర్శనం చేసుకుందామని" అంటూ నవ్వాడు ముకుందరావు.

"వెయ్యి రూపాయలైనా ఇవ్వాలి. ఎక్కడ దోచుకు రమ్మంటావ్"

"ఏ బాంకివయినా డూప్లికేట్ తాళాలు దొరికితే బావుండు కదూ ఆనందం?" అంటూ ముకుందరావు తృప్తిగా నవ్వి, "నా పెళ్లాం దగ్గిర ఉందికానీ అడగలేను." అన్నాడు.

"ముఖం చెల్లదను. నీకూ నాకూ ఇచ్చేందుకు ఎవ్వరా రాసులు పోసుక కూర్చుంది."

"మురహరి!"

"కావలికి పోవాలి కదూ?"

"పోదాం! ఓ గంట ప్రయాణం! మరి

ఇప్పుడే పోదామా?"

"లేడికి లేచిందే పరుగు" అంటూ ఆనందం సన్నగా నవ్వాడు.

"పదకూడదు."

ఇద్దరూ వచ్చి, కార్లో కూర్చున్నారు. "కావలికి పోనియ్!" అంటూ ముకుందరావు హెచ్చరించాడు.

"కావలికా? పెట్రోల్..." అంటూ డ్రైవర్ సన్నగా గొణిగాడు.

"టాంకునిండా పోసుకరా! ఇక్కడ ఉంటాం. దిగవోయ్!"

డ్రైవర్ చేతులు నలుపుకుంటూ "పాత బాకీ ఇవ్వందే మళ్లీ రావద్దన్నారయ్యా బంకువాళ్లు" అన్నాడు.

"హారి భగవంతుడా! లేస్తే సమస్యలు! అన్నీ పాడు డబ్బు గురించినవే! సరి సరి! నేనూ వస్తాను" అంటూ ముకుందరావు ఆనందంవేపుకు తిరిగి ఓ క్షణం ఆలోచించాడు. "కావలికల్లోపోయి ఎంత డబ్బు అడిగితే గౌరవంగా ఉంటుంది? అధమం ఐదారు వేలన్నా అడగాలా? అక్కర్లేదా?"

"ఉండదూ మరి పాపం! ఇచ్చేవాడుంటే ఐదువేలేం లెక్క? ఏకంగా ఐదు లక్షలే తీసుకురామూ? ఏమైనా బరువయ్యేవస్తావా ఏం?"

"అందుకని ఓ ఐదువేలు అడుగుదాం. సరేనా? జయగోపాలుకు రెండో, మూడో ఇవొచ్చు. పెట్రోలు బంకువాళ్లకు ఐదారొందలు పారెయ్యొచ్చు!"

"నీ ఊహాబలం దివ్యంగా ఉన్నాయి! ఇంతకూ వాళ్లు ఇవ్వొద్దా?"

## కల్యాణి

"అది విధాకచక్రం! కృష్ణసారథ్యం చెయ్!"

"కృష్ణ సారథ్యం! సంధి పొసగలేదు. యుద్ధం తప్పలేదు."

"కృష్ణుడికి యుద్ధమంటే, మనకు డబ్బున్నట్లు బలే ఇష్టంలే! అందుకనే ఆయన ఏకంగా యుద్ధానికే మాట్లాడి వచ్చాడు." అంటూ ముకుందరావు తృప్తిగానవ్వాడు. ఇంతలో కారు పెట్రోలు బంకు దగ్గరకు వచ్చింది. బంకు మేనేజరు వాళ్లకు వినిపించనంత మెల్లగా డ్రైవరుతో "అడిగావా?" అంటూ హెచ్చరించాడు.

"ఆ ఫుల్‌గా పొయ్ !" అంటూ డ్రైవర్ నవ్వాడు.

మేనేజరు, డబ్బు వస్తుందన్న ఉత్సాహంతో క్షణంలో కారుటాంకు నింపాడు.

"సాయంకాలం డబ్బు పంపుతా!" అంటూ ముకుందరావు కిటికీలోంచి తల నిక్కించి అన్నాడు.

అతడు మాట ముగించీ ముగించక ముందే, అమ్ములోంచి విడవడ్డబాణం మల్లే కారు దూసుక పోయింది. నోరంతా తెరచిన బంకు మేనేజరు నోట్లోకి కారు మిగిల్చి పోయిన దుమ్ము యింత పోగా 'ఛూత్!' అని అనకుండా ఉండలేకపోయాడు.

తలమనిషి చంద్రయ్య మస్తుగా తిని, గ్రుడ్లుతేల్చి, పక్కనే ఉన్న సాగాకు దుబ్బంలో ఓ నాదపొగాకు కొముక్కొని అక్కడే చతికిలపడి, చుట్టలు చుట్టుకో సాగాడు.

ఆకలి తీరిన తరువాత, అతని మనస్సులో ఆశలి బయలుదేరింది. ఆదాయం, ఖర్చూ తులామానం అంతెకురాని యజమాని కొలువు పనివాళ్లకు, ముఖ్యంగా తినగలిగిన వాళ్లకు లాభదాయకం. చూడబోతే తనయజమాని మాంచి ఖర్చుగాడుగా అవుపడుతున్నాడు. అక్కరా సక్కరల్లో సులభంగా చిక్కేవాడులా ఉన్నాడు, వేటకు ముందు, ఉచ్చులు చూసుకుంటూ పడబోయే వేటగురించిన కలవరింతలతో తేలిపోయే వేటగాని మల్లే చంద్రయ్య సంబరాలు పోసాగాడు. అతడిలో ఉత్సాహం చెలమలా మనస్సులో ఊరసాగింది.

ఇంటికి వచ్చేసరికి ముకుందరావు భార్య కల్యాణి అవుపడింది అతడికి "రెండ్రోజులుగా, ఏం సంగతి ఇక్కడ ఉన్నావ్?" అంటూ ఆమె అడిగింది.

"ఏం చెప్పమంటారమ్మా? అక్కడ నారేతలకు అదను మించి పోతోంది. ఇక్కడ బాబుగారు డబ్బు ఇవ్వక రేపు మాపు అంటూండే! ఇట్లా అయితే............"

"మొన్న ఎన్ని పుట్లు అమ్మింది?"

"నలభై పుట్లు! ధరా మా మంచిగానె పడిందమ్మా! అందరికన్నా ఓ పాతిక ఎక్కువే వచ్చాయ్."

"అంతడబ్బు ఏమయి పోయిందో? జయగోపాల్ కంపెనీకే సరిపోయి ఉంటుంది." అంటూ ఆమె పైకి అనలేదు.

ఆమె ముఖంలోని తీవ్రమైన విషాద భావాలు, వృద్ధుడూ, అనుభవజ్ఞుడూ అయిన చంద్రయ్య మనస్సుకు అందకుండా ఉండలేదు.

"ఇంతకూ ఏమన్నారు?"

"ఆనందం దగ్గరకు పొమ్మనిరి. పోతే, ఆయనా బాబుగారూ కలిసి ఎక్కడికో పోయి ఇంకా వచ్చినట్లు లేదు."

ఈ కాస్త డబ్బుతో టాంకు నిండా పెట్రోలు పోసుకుని అప్పు ఇచ్చేవాడికోసం ఇద్దరూ వేట ప్రారంభించారని ఆమె గ్రహించుకోగలిగింది.

"వూరికి వెళ్లేముందు ఓమాటు కనపడిపో!" అంటూ ఆమె లోపలకు అడుగులు వేసింది. అంత డబ్బు వచ్చి నాలుగు నాళ్లయినా కాలేదు. వాటికి రెక్కలు వచ్చాయి. ఈవిధంగా డబ్బు ఖర్చుచేస్తే కొండలయినా కరగిపోకపోవు. భగవంతుడు



# కల్యాణి

"హాయ్! ముకుందరావ్! ఈ డొంక తిరుగుడు లేకుండా, అక్షరాలా చెప్పొచ్చే దేమంటే, లొకేషన్ పేరుతో అలా పది వూళ్ళు సరదాగా తిరిగి రావాలని బయులు దేరాం! నీ కోసమే ఈ వూళ్ళో ఆగాము. నీవూ మాతో వచ్చి....." అంటూ మాట లు దొరక్క ప్రక్కనే ఉన్న నవ్వుతూయున నేవు చూశాడు అరుణ్.

"ఆనందామృతంలో మీ వాటా పుచ్చు కోమని అభ్యర్థన" అంటూ అతడు పూర్తి చేశాడు.

"మాటలు ఇలా మరచిపోయినప్పుడు, నేర్పుతాడనే కవిగారిని వెంటబెట్టుక వచ్చింది. కదూ?" అంటూ శకుంతల చప్పట్లు చరచి నవ్వేసింది.

ముకుందరావుకు ఆమె నవ్వుల మల్లెలూ గులాబీలు వికసించాయి.

"అయితే ఎప్పుడు మీ ప్రయాణం?"

"ఎప్పుడూ అంటూ అడగడం ఎందు కోసం, ఏమయినా? పద! ఇప్పుడే పోదాం!" ముకుందరావు క్షణం ఆలోచించాడు. నీ, కాగితమ్మీద నో నాలుగు వాక్యాలు బరికి "ఇది ఆనందానికి ఇచ్చి, సూట్‌కేస్ తీసు కురా!" అంటూ డ్రైవరుకు అందించి, "వాడిని రానీయండి! వెళ్తాం!" అన్నాడు.

"అయితే ఎన్ని రోజుల ప్రోగ్రామ్?" అంటూ ముకుందరావు శకుంతలవేపు తిరి గాడు.

"ఎప్పుడు విసుగొస్తే అప్పుడు తిరిగి రావడం! అయినా మీకు విసుగు వేయ కుండా మేమంతా ఉన్నాంగా!" అంటూ శకుం తల జారిపోతున్న పమిట సర్దుకుంది.

"మా కారా ఒకటో రకం ఉపాసకుడు లెండి! ఉపాసనకు భంగం లేకపోతే ఎక్క డున్నా ఉమర్ కీర్తిని స్మరిస్తూ, కాలం గడిపగలడు" అని అరుణ్ బిగ్గరగానవ్వాడు! అతడి నవ్వుతో అందరూ కలుసుకున్నారు.

ఇంతలో ముకుందరావు డ్రైవర్ సూట్ కేసుతో రావటంచూసి అరుణ్ స్టైకిలేస్తూ, "అన్నా! పదండిలా! నీవూ ముకుందరావు కూడా! నేనూ కవి మాట్లాడుకోవాలి!" అన్నాడు.

శకుంతల గోముగా, "కార్లో కూడా కథ గురించి తర్కించాలేం?" అంది.

"అబ్బో! జోరుగా కారు పోతూంటే భావాలూ అదే స్పీడులో దూకుతాయ్ కదూ కవివీ!"

"అంతే! అంతే! మా ఇద్దరూమాత్రం తర్క వితర్కాలకు పోకుండా సాగివత్తురు గాక!" అన్నాడు కవి కార్లో కాలుపెడుతూ.

శకుంతల దూకుడుగా కార్లో వచ్చి ఇంచుమించు ముకుందరావు వళ్ళోకూర్చుంది. ఆ హఠాత్సంఘటనకు ముకుందరావు ఏ క్షణంసేపు బిత్తరపోయి క్రమంగా సర్దు కున్నాడు.

"మీరు ఎన్ని రోజాలుంటారు?"

"మీ రెన్ని రోజాలుండమంటే అన్ని రోజులు!" అని నవ్వింది శకుంతల.

"అక్కడ మీకు....."

"ఇప్పుడేమీ చేతిలో పిక్చర్సు లేవు. ఉండేవన్నీ మొదలు కానివి మొదలయినా నేను ఇంకా వాళ్ళకు కాల్‌షీట్లు ఇవ్వలేదు. మరి మీకుమాత్రం నేను తొందరగా పోవా లని ఉంటే....."

"అబ్బే! మధ్య నాకేం?" అంటూ ముకుందరావు, "ఇప్పుడు అరుణ్ ఏకథ తీసుకోవాలనుకుంటున్నాడు?" అడిగాడు

"ఏదో సోషల్! అంతా అవుట్‌డోర్ లోనే తీస్తాట్ట. డాక్యుమెంటరీలాగ!"

"బహుశా మీరు హీరోయిన్..."

"ఇంకా ఏమీ చెప్పందే! నా అభివృద్ధికి ఎంతో సాయం చేశాడు. ఆ గురుత్వంతో వచ్చాను."

"వచ్చిందానికి మీకేమీ నష్టం లేదులెండి" ముకుందరావు నన్నగా నవ్వాడు.

"ఇక్కడ లాభ నష్టాల ప్రసక్తి లేదు. అయినా, ఆ పద్ధతుల గుంజాటన నాకంతగా లేదు లెండి!"

"అందు క్కారణం, బహుశా మీరెప్పుడు నష్టం పొందకపోవడమే నేమో!"

"నేనేమన్నా వ్యాపారం చేస్తున్నానా?"

"లాభ నష్టాలకు వ్యాపారం చేయనక్కర లేదు. ప్రతి కార్యానికి ఏదో రూపంలో ఉంటుంది. ఉదాహరణకు, నేను మీతో వచ్చానంటే, పొందబోయే ఆనందమే నాకు లాభం! అంతకన్నా....."

"ఒక్కొక్కప్పుడు ఆనందమూ అందక పోవచ్చు! అదేమన్నా విలువలేని వస్తువా? ఎంతో అపురూపమైన వస్తువే అది!"

"అప్పుడు నేను నష్టపోయాను. అంతే!"

"అల్లా నేను అనుకోను ఆనందం అనేది మనం సృష్టించుకోవాల్సిన వస్తువు అది ఎక్కడో, కార్లో బృందావన తోటలోకి వెళ్ళినంతమాత్రాన చిక్కే వస్తువుకాదు. అలా అంత సులభంగా లభించేదయితే

ందరూ అక్కడే మకాంచేసి ఉండేవాళ్లు" ఆమె అంది.

"అంటే మీ ఉద్దేశం?"

"బాగా చెబుతాను. మనిషి మనస్సులో ఆనందం సరస్సులో నీళ్లు వూరినట్లువూరాలి. సం వెదికి చిక్కించుకునే వస్తువుకాదు. నికి పరిసరాల ప్రాధాన్యం ఉండకపోవచ్చు. ప్పుడు నేను, మీరు చెప్పిన ఆనందం పమ్మైరావడంలేదు. నా ఇంట్లో దానికి భావం రాలేదు. రాదు కూడా!" అంటూ ంభీరమైన చూపులతో ఆమె, ఆనంద వును ముంచివేసింది. "నేను రావడం ్రతజ్ఞతాభావంతోనూ, కుతూహలంతోనూ! ంతే!"

"దానికే చిత్తం వచ్చిన పేరు పెట్టు న్నారేమో! నా విషయంలోమటుకూ దొర ని వస్తువు. ఎక్కడయినా అమ్మకానికి రికే వసయితే, నా కున్నదంతా పణం పెడ ము."

"మీ మాటలు వింటూంటే జాలి వేస్తు ్నయి."

"జానేమో! కానీ ఇదంతా సత్యం!" ంటూ అతడు నిట్టూర్చాడు.

"మీరు అందుకోలేనిదీ, పొందలేనిదీ మీ లేదని విన్నాను. మరి మీ మాటలు..."

"ఇంతకుముందు చెప్పారే, ఆనందం అనే స్తువు మనస్సులో పుడుతుందని—నా మనస్సు వో ఎడారి అయిపోయిందేమో! ఆనందమనే ఒయాసిస్సు కానరావడంలేదు. దానికే నా వెదకులాట! ఇప్పుడర్థం అయిందా శకుంతలాదేవి! నేనెందుకు అరుణ్ వమ్మనంగావే గంగిరెద్దులా తలూపి, కారు కదలించానో?"

"సారీ! మిమ్మలను అనవసరంగా బాధ పెట్టాను."

"పోనీయండి! దాన్ని చిక్కించుకునే దారి ఏమైనా మీకు తెలిసివుంటే చెప్పండి!"

శకుంతల చిలిపిగా నవ్వి, తృషితంగా చూస్తూ, "తప్పకుండా! తనివితీరా పొంద గలరు" అంది.

"అయితే ధన్యుణ్ణి!" అంటూ సంతో షంతో ఉజ్జ్వలమైన ముఖంతో ఆమెను చూడసాగాడు ముకుందరావు.

కారు మాత్రం దుమ్ము లేపకండా విశాల మైన బెంగుళూరు రోడ్డుమీద అతి వేగంతో పోతోంది.

* * *

డ్రైవర్ తెచ్చిన ఉత్తరం పట్టుకుని ఆనందరావు అల్లాగే కూర్చుండిపోయాడు.

"—అత్యవసరంగా అరుణ్ తో వెళుతున్నాను. డబ్బు లేకపోతే ఏమీ జరగదని నీకూ తెలును డబ్బు తీసుకుపోతున్నా. తలమనిషి వ్యవహారం నీ పరిష్కారానికి విడుస్తున్నాను—"

అతడు, ఆ ఉత్తరంలోని వాక్యాలు ఎన్ని సార్లు చదువుకున్నాడో లెక్కలేదు.

చంద్రయ్య చేత్రోలు పొగాకుచుట్ట దమ్ములు ఘట్టిగాలాగుతూ, చిరునవ్వులు నవ్వుకోసాగాడు. అతడు ఇలా కావడాన్నే మన స్సులో కోరుసోసాగాడు. ఎక్కడా దొరక రాదనే వేయి దేవుళ్లకు పేరు పేరునా నమ స్కారాలు చేయసాగాడు. బహుశా అతడి విన్నపాలు ఏ దేవుడయినా వింటాడో, ఏమో?

పొద్దు బాగా వాటారుతూండగా ఆనందం లోపలకువచ్చి, చంద్రయ్య వళ్లోకి రూపా యల బొత్తి విసరేస్తూ, "వూ వెళ్లు! ఎల్లాగో పని సర్దుకో! రెండు మూడు వాళ్లలోవచ్చి చూస్తాను" అన్నాడు.

చంద్రయ్య డబ్బు లెక్క చూసుకుని "నాలుగొందలకు నాలుగు రోజాలయింది. ఈ దఫా మరో నాలుగొందలకు నాలుగు వెళ్లే కావచ్చు!" అనుకుని నవ్వుకున్నాడు.

ఆనందం లోపలకు వెళ్లేసరికి వో టెలిగ్రామ్ ఎదురుచూస్తోంది. అది చింపి చదువుకోకుండానే వీధిలోపడి సరాసరి టెలి గ్రాఫ్ ఆఫీసుకిపోయి, బారెడు పొడుగు టెలిగ్రామ్ ముకుందరావుకు పంపాడు.

మరునాటికల్లా వో కాయితాల బొత్తి నిండా రివెన్యూ స్టాంపులమీది సంతకాలతో ఆనందరావుకు చేరింది. అది చూసి ఆనంద రావు భారంగా నిట్టూర్చాడు.

నెలలకు నెలలు తిరుగుతున్నాయి. ముకుం దరావు మకాం మదరాసే అయ్యింది. ఇక్కడ ఆనందరావు ఫైల్లో ముకుందరావు రాసిన నోట్లు పెరుగుతున్నాయి. ఇదంతా కల్యాణి దాకా పోకుండా ఉండలేదు. ఆమె, ఆనం దాన్ని పిలిచి వ్యవహారం అంతమయ్యేందుకు ఇంక ఎంతసేపుందో తెలుసుకోవాలనుకుంది.

ఇంతలో ఆనందరావు, ముకుందరావు ఇంటికి వచ్చాడు. అతడిని చూస్తూనే కల్యాణి "అంతా అయిపోయింది!" అనుకుంది.

గంభీరంగా ఆమె మౌనం వహించింది.

అతి కష్టమ్మీద ఆనందరావు, "స్రీ ముఖ్యమైన పని..." అంటూ ఆగాడు.

"మీ ఇద్దరకూ ముఖ్యమైన పనులు డబ్బుతోనే! ఎంత కావాలి?" అంది ఆమె.

"ఓ పదివేలు! ఎంత అయినా...."

"ఆ విషయం మీరు చెప్పబోవడం దుస్సా హసం అవుతుంది ఆనందరావుగారూ! డబ్బు పట్టుకెళ్లండి! ఆయనకు వో ఉత్తరం కూడా రాయండి. కల్యాణి దగ్గర, ఇంకా మరో పాతికవేలకు రొక్కం ఉందని" అంటూ గంభీరంగా లోపలకుపోయి, వో క్షణంలో తిరిగివచ్చి, చెక్కు అందించింది కల్యాణి.

ఆనందరావు ఫైలోంచి వో కాగితంతీసి కల్యాణికి అందిస్తూ, "ఉంచండి! నేను పరాయివాడిని, మీరు నా కిస్తున్నారు" అన్నాడు.

"దీనివల్ల పరిణామాలు....."

"నన్నడిగితే ముకుందరావూ సంతోషపడ తాడు పైగా!" అంటూ ఆనందరావు వెళ్లి పోయాడు.



. . . అందుకని నిన్ను ముందు తీసుకెళ్లాడు భగవంతుడు నీతో నీతోటే వస్తాను మనిషికి, మమతకూ హృదయానికి, మనస్సుకు చోటులేని ఈ ప్రపంచంమీద వెగటు పుట్టిందమ్మా అక్కడైనా నీ యీ గుడ్డి కొడుకుని కాస్త కనిపెట్టుకు నుంటావో లేదో '' అంటూనే పక్కమీదికి ఒరిగిపోయాడు

నాకు భయంవేసిం దక్కా ఎంత పిలిచి దినా పలకలేదు కదిపినా కదలలేదు నాకు మరింత గాభరావేసి, అమ్మనూ, నాన్ననూ లేపాను '

భారతి కంఠం దుఃఖోద్వేగంలో పూడుకు పోయింది క్షణంపాటు మాట్లాడలేక పోయింది చాలాసేపటికి గొంతు పెకల్చుకుని "పాప పోయా దక్కా!'' అంది

# మూసిన కిటికీ

స్థాణువులా వింటూ ఉండిపోయింది

"తర్వాత నీకు ఉత్తరం వ్రాద్దామను కున్నాను పోరోజు ఎవ్వరూ లేని సమయం చూసి, నీకుం వ్రాద్దామని కార్డు ముందు చుకున్నాను గబగబా వ్రాస్తున్నాను అంత లోకే అమ్మ వచ్చింది గాభరాగా, రాస్తున్న ఉత్తరం లాక్కుంది ఎవరితోనో చది వించుకుంది కాబోలు ఇంటికొచ్చి నాకు బాగా దేహశుద్ధి చేసింది మళ్ళీ ఉత్తరం వ్రాస్తున్నట్టు కంట బడితే, తోలు వలుస్తా నంది అందువల్ల వ్రాయలేకపోయానక్కా'' అంది జలజల కన్నీరు రాలుస్తూ

పాలేరు రంగడు అటేపు వచ్చాడు "మీ రిక్కడున్నారా అమ్మగారూ ! నాన్న గారు మీ గురించి వెదుకుతున్నారు పదండి'' అన్నాడు

"భారతీ !'' అంది మాధవి ''అలా బావివేపు పోదామే'' అంది ఎందుకో తనకు మళ్ళీ ఒకసారి ఆ జిల్లేడు పొదల్ని చూడా లనిపించింది అమాటే పైకి అంది కూడా

"అదేం చిత్రమో మాధవమ్మ గారూ ! మీ చంద్రంబావ చచ్చినాడె నిలు వునా ఎండుకుపోయిందమ్మా నీళ్ళు లెవ్వని కాదు నిప్పులని కాదు అదేదో భగ మంతుడికే తెలియాలి నాన్నగారు కొట్టే యించాడు'' అన్నాడు రంగడు

బాధగా నిట్టూర్పు వదిలింది

పాప స్మృతులన్నీ తన చుట్టూ నుండి ఒక్కొక్కటే తొలగిపోతున్నాయి

''భగవాన్ ' ఇదేమిటి అనుకుని ఇంటి వేపు నడిచింది

అసలు భగవంతుని లీలలంటే ఏమిటి? పేటిని లీలలుగా పరిగణించాలి పేటిని పరిగణించకూడదు? భగవంతుణ్ణి హృదయపూర్వకంగా నమ్మి న్యాయాచరణలో కాస్తంతు కూడా పొల్లు పోనీయని వారికి భగవంతుడు అన్యాయం చేస్తా డెందుకు? అసలు భగవంతు డనేవాడు ఉన్నాడా ? ఉంటే అతనికి దివ్య చక్షువు ఉందనే కోవటంలో ఎంతవరకు నిజం ఉంది ఆలోచించిన కొలదీ మాధవి తల, హృద యం, బరువెక్కసాగాయి మగత కమ్ముకు రాసాగింది.

మాధవికి రెండు కళ్ళు కనిపించాయి తీక్షణంగా మెరుస్తున్నాయి ఎర్రబడిన ఆ కళ్లలో ఆ రూక్షణత్వం క్రింద ఏదో అమాయకత్వం దాగిఉంది కళ్ళ వెనుక దాగి, అత్తయ్య కనిపించింది కనీసం అప్పుడేనా పలుకలేదు నమ్మినవారి నాశ్రయించితే, వారు ద్రోహం చేస్తే, చూసే దీనమైన చూపులు, చేతకానితనం వల్ల మరుగుపడ్డ కోపపు జ్వాలలు, ఆ కళ్లలోంచి మాధవిని ప్రశ్నించాయి

జీవన సంగ్రామంలో తోడు కావాలి సైనికుడికి ఆయుధాల అవసర మెంతో మనిషికి ఆదర్శాలూ అంతే అనుక్షణం ఆదర్శాలను ముందుకు నడిపిస్తూ, తనను



కొత్తదనం, లేతదనం!

—ఫొటో: ప్రభాకర్, మహాధిక్.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4″ × 2″, 4″ × 4″ చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥





## విజ్జీ

తన ఖర్చుమీద మనదేశానికి ఆహ్వానించారు. డి. ఆర్. జార్డైన్ రెండవసారి చిత్తుగా ఓడిపోవడం యీ పోటీలో జరిగింది. మొదటిసారి జార్డైన్ జట్టు వోడిపోయినది ఆస్ట్రేలియాతో పోటీలో. 1935—36లో యీ పోటీ బెనారస్‌లో విజ్జీ రాజభవనంలోని క్రీడా మైదానంలో జరిగింది. విదేశీ జట్టు పర్యటనున్నప్పుడు యు. పి. లో వోడిపోతాయన్న సిద్ధాంతం రూపొందడానికి యిదే నాంది.

భారతదేశ ముఖ్యపట్టణానికి విజ్జీ విలువైన బహుమతులు యిచ్చారు. ఏభైవేల రూపాయల ఖర్చుతో విజ్జీ నిర్మించియిచ్చిన వెల్లింగ్టన్ పెవిలియన్, దేశ విభజనానంతరం లాహోర్‌లేని లోటుతీర్చి టెస్ట్ పోటీలకు విలువ కలిపించింది. విజ్జీ స్మారకచిహ్నంగా దీనిపేరు మార్చాలని ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలుస్తోంది. ఢిల్లీకి వీరి రెండవ బహుమతి రోషనారా క్లబ్‌లోని క్రికెట్ పెవిలియన్.

భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు అధ్యక్షులుగా విజ్జీ చేసినసేవ, క్రికెట్ ఆటగాళ్ళు, అభిమానులు మరువలేనిది. ఆర్థిక యిబ్బందులలోవున్న క్రికెట్ ఆటగాళ్లకై వీరొక సహాయ నిధి ప్రారంభించారు. భారత క్రికెట్ రంగానికి పితామహులైన సి. కె. నాయుడు షష్టి పూర్తి సందర్భంగా విరాళాలు వసూలుచేసి, పర్సు బహూకరించి, క్రీడాకారులకు అపూర్వమైన గౌరవాన్ని, స్థానాన్ని రూపొందించారు విజ్జీ.

క్రికెట్ క్రీడారంగంలోనే విదేశాలుకూడా విజ్జీ సేవా ఫలితాల్ని పొందాయి. ఇంపీరియల్ క్రికెట్ కాన్ఫరెన్స్‌కు భారత ప్రతినిధిగా హాజరైనప్పుడు, సభ్య దేశాలన్నిటికీ వోటింగ్‌లో సమాన ప్రతిపత్తి ఉండాలని వాదించి, విజయులయ్యారు. దీనివల్ల దక్షిణ ఆఫ్రికా, ఇంగ్లాండ్, ఆస్ట్రేలియాతోపాటు ఇండియా, పాకిస్తాన్, వెస్ట్ ఇండీస్, న్యూజీలాండ్ కూడా సమాన హోదాపొందాయి. 'ఇంపీరియల్' అన్న పేరు తొలగించాలని 1955లో విజ్జీ లేవదీసిన వివాదం వల్ల ప్రదమై యిటీవలనే యీ పేరు 'ఇంటర్నేషనల్ క్రికెట్ కాన్ఫరెన్స్'గా మార్చబడినది.

ఆస్ట్రేలియన్ జట్టు ఆట చూడాలన్న భారతీయుల కాంక్షకు రూపకల్పనచేసి, 1956లో ఇయన్ జాన్సన్ జట్టు పర్యటనకు విజీ ఏర్పాటు చేయించారు.

౦గ్ జట్టు పర్యటన కూడా దీనివెంటనే ౦గింది మద్రాస్ పోటీలో తొలి వికెట్‌లో 413 పరుగులు (రాయ్ 173, మంకడ్ 231) సాధించడమన్న బ్రహ్మాండమైన్న రికార్డు విజ్జీ అధ్యక్షులుగా వున్నకాలంలో జరిగింది.

విజ్జీని వెతుక్కుంటూ గౌరవాలు వచ్చా యంటే అతిశయోక్తికాదు. ఆంధ్ర, ఉత్తర ప్రదేశ్ జట్లకు అధ్యక్షులుగా ఉంటున్న ప్పుడే విజ్జీ భారత క్రికెట్ బోర్డ్‌కు కూడా అధ్యక్షులయ్యారు. పాతిక సంవత్సరాలకు పైగా పడిగాపులుగాస్తేనేకాని లభించని ఎం. సి. సి. సభ్యత్వం విజ్జీకి అతి స్వల్ప కాలంలోనే లభించింది. ఎనిమిదవ ఎడ్వర్డ్ రాజు వద్దనుండి స్వీకరించిన 'సర్' బిరుదాన్ని స్వాతంత్ర్యానంతరం విసర్జించారు విజ్జీ. పండితులు సర్వత్రా పూజ్యులైనట్లే, క్రీడాకారులు కూడా సన్మానింపబడుతారు. 1959లో విజ్జీ 'పద్మభూషణ'గా సన్మానించబడ్డారు. 'మీకు లభించిన పతకాలన్నిటిలో యేది గొప్పదని మీ ఉద్దేశం" అని శ్రీ నైహా యూ సందర్భంలో విజ్జీని ప్రశ్నించారు. "అన్నిటికంటె గొప్పది, గౌరవనీయమైనది మీరు యిప్పుడు నాకు యివ్వగా యిక మిగతా వాటితో పనేమిటి" అని విజ్జీ జవా బిచ్చారు.

"రసవత్తరమైన టెస్ట్ పోటీ ప్రత్యక్ష వ్యాఖ్యలు ద్వారా దేశంలోని వేలాది క్రికెట్ క్రీడాకారులకు, అభిమానులకు విజ్జీపేరు చిరపరిచితం" అని 'పద్మభూషణ' గౌరవ మిస్తున్న సందర్భంలో అధికారపత్రంలో పేర్కొనబడింది.

"హలో ఎవ్రీబడీ! దిస్ యీజ్ విజ్జీ హియర్" అని క్రికెట్ వ్యాఖ్యానాలు ప్రారం భించి, ఎదురుగా వున్న వ్యక్తులతో మాట్లాడు తున్నట్లు సాగిపోయే విజ్జీ వ్యాఖ్యానాలు, క్రికెట్‌ను గూర్చి వీరికివున్న సమగ్ర పరిజ్ఞానా నికి నిదర్శనం. ఆటమధ్యలో విరామం వచ్చి నప్పుడు, సందర్భశుద్ధివుండి, ఆ ఆటతో సంబంధంవున్న పాత జ్ఞాపకాలను, సంఘట నలను వారు వినసొంపుగా వివరించేవారు.

ప్రత్యక్ష వ్యాఖ్యానాలను వీరు ఎంతో శ్రద్ధ తీసుకొని శ్రమించి పని చేసేవారు. అనేక విషయాల గురించి, గత క్రికెట్ చరిత్ర గురించి క్షుణ్ణంగా చదివి, ఎన్నో సంగతులు జ్ఞాపకం పెట్టుకొని వ్యాఖ్యానాలకు వచ్చేవారు. వ్యాఖ్యాల స్థానంలో విజ్జీతో పాటుగా కూర్చొని అనేకమైన టెస్ట్ పోటీలు చూసే సదవకాశం నాకు లభిం

యికరవ్వేడుతూ శ్రోతలకు విసుగు కలిగించడమంటే విజ్జీకి వచ్చేదికాదు. ఎవరికీ తట్టని పోమ్యాలు తీసుకొనివచ్చి, వ్యాఖ్యా నాలను రసవత్తరం చేసేవారు. క్రికెట్ వ్యాఖ్యానాలలో రాజకీయ పోమ్యాలు, పార్ల మెంట్‌లో క్రికెట్ పోమ్యాలు ప్రస్తావిం చడం విజ్జీకి అలవోకగా వచ్చేది.

కాన్పూర్ టెస్ట్ పోటీలో ఆస్ట్రేలియా ఆటగాళ్లను చిత్తుచేసిన జేసూపటేల్‌ను గూర్చి విజ్జీ యిలా అన్నారు :

"ఆయుధాలు లేకుండా విదేశీయులను చిత్తు చేసిన యింకొక గుజరాతీ యితను. గాంధిజీ తన 'స్పిన్నింగ్ వీల్!' (చరఖా)తో బ్రిటిష్‌వార్ని చిత్తు చేయగా, యితడు తన 'స్పిన్నింగ్ ఫింగర్'తో ఆస్ట్రేలియన్లకు శృంగభంగం చేసాడు."

1960 లో కేంద్ర ప్రభుత్వోద్యోగుల సమ్మె చెప్పుకోదగ్గ ఫలితాలు లేకుండా ముగిసి నప్పుడు లోక్‌సభలో విజ్జీ యిలా అన్నారు: "అయిదు రోజులు ఫీల్డ్‌లో వుండి కూడా అందరూ 'డక్' అయిపోయారు."

తెలుగుభాష అన్నా, తెలుగువారన్నా విజ్జీకి అపరిమితమైన అభిమానం. చిన్నతనంనుండీ నేను కూడా విజ్జీలాగనే ఉత్తర ప్రాంతం లోనే పెరిగినా, నాతో తెలుగులోతప్ప విజ్జీ మాట్లాడేవారుకాదు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలని, ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించి, 1942 లో క్రిప్స్ సంఘం దగ్గ రకు తీసుకొని వెళ్లిన వ్యక్తి విజ్జీ.

స్వతంత్రోద్యమంలో విజ్జీ వహించిన పాత్ర అందరికీ తెలియకపోవచ్చు. విజ్జీ— తల్లి గాంధిగారి శిష్యురాలు. క్విట్ ఇండియా

కార్యకర్తలకు తన భవనంలో విజ్జీ ఆశ్రయం యిచ్చారు. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొందుకి విజ్జీ ముందుకువస్తే గాంధిజీ వద్దని సలహా యిచ్చారు.

బెనారస్ హిందూ విశ్వ విద్యాలయాన్ని సైనిక ఆక్రమణలోకి తీసుకోవాలని యు.పి. గవర్నర్ సర్ మారిస్ హాలె ప్రయత్నించగా విజ్జీ ఆ యత్నాలు విఫలమయ్యేటట్లు చేసారు. భవనాలను ఆక్రమించుకోవాలని జిల్లా మేజిస్ట్రేట్‌కు వచ్చిన ఉత్తర్వులు నిముషాలమీద రద్దు చేయించారు.

విజ్జీ గొప్ప దానశీలురు. వ్యక్తులకు, సంస్థలకు వీరు యిచ్చిన విరాళాలు, చేసిన సహాయాలు ఎన్నో! ఆంధ్రప్రదేశ్ పైగా మాలక్షే తమ కోరుకొండ భవనాలను యిచ్చి వేసారు.

వేటలో విజ్జీ ఆసక్తి వర్ణనాతీతం. ఇద్ద ర్లుగంలో నహా యెన్నో రకాల జంతువులను వేటాడారు. వీరు వేటాడిన పులులే సుమారు 320 కి పైగా వుంటాయి.

ఎన్ని బాధ్యతలు వ్యాపారాలు, ప్రాశంచిక మైన సరదాలువున్నా ఆధ్యాత్మికచింతనకు కూడా విజ్జీకి కాల వ్యవధి దొరికేది. దేశం లోని ఎన్నో దేవాలయాలను, పుణ్యతీర్థాలను దర్శించారు. సింహాచలం కొండలకు కార్లు వెళ్లే రోడ్డు వున్న రోజుల్లో కూడా విజ్జీ యిప్పటికీ కాలినడకన వెళ్లేవారు.

క్రికెట్ జీవితంలో 'సెంచరీ'కి ప్రాముఖ్య మున్నట్లే జీవితంలో షష్ఠిపూర్తికి ప్రాము ఖ్యం వున్నది. విజ్జీ షష్ఠిపూర్తికి చేరువలో వుండగానే వారి 'ఇన్నింగ్స్' సమాప్తమై పోవడం చాలా దుఃఖకారకం. మనకు మిగిలి నది వారి స్మృతి మాత్రమే. ●

వంటబూర బావేదూ! హస్పిటల్నించి వచ్చింతర్వాత మందిస్తా! అంటే భయపడకండి! మిరియాలకషాయం

వసుంధర

... వదిలి వుంచేసు కొవేవాడు. కాని నే వలా చేయలేను.....ఆ పర్సును పోగొట్టుకొన్నవాళ్లకు అప్పచెప్పాలి. ఎలా? ఒకసారి సందు చివరదాకా వచ్చాను. ఎవరన్నా వెతుకుతున్నారేమోనని. లేదు. ఎవ రన్నైనా అడుగుదామనుకున్నాను. కాని, అబద్ధంఆడి, ఆ పర్సు తమదేనంటె— అప్ర యత్నంగా లైటు స్తంభంక్రిందనున్న ముసలి వాడు పసిపాప గుర్తొచ్చారు. పోగొట్టుకున్న వాళ్లకు పర్సు ఇవ్వకుండా వేరేవాళ్లకు ఇచ్చే దానికంటె కూడు గుడ్డ లేక రోజురోజుకు మృత్యువుకు దగ్గరవుతున్న ఆ ముసలివాడి కిచ్చేస్తే మంచిదనిపించింది.అదే నిర్ణయంతో సినిమాకు కూడ వెళ్లకుండా తిరిగి వచ్చే సాను.

యధాప్రకారం మరునాడు సాయంత్రం ఆఫీసునుంచి తిరిగొస్తు, ముసలివాడిదగ్గర ఆగి, మామూలుగా డబ్బిచ్చేసి, "ఇదిగో.... అబ్బి! ఈ పది రూపాయలు నీ దగ్గరుం చుకో. దీపావళి పండగ కూడ దగ్గరొ స్తోంది. అక్షిర్మకి గౌను కుట్టించి. ..నీవు కూడ చొక్కా కుట్టించుకో" అన్నాను డబ్బు అందిస్తూ.

"నా కెందుకు బాబు అంత డబ్బు?"అని తీసుకోలేదు. "ఫరవాలేదు. వుంచు. అది నాకు దార్లో దొరికింది. అదే నీ కిస్తున్నాను. పండక్కి వుంచుకో...." మళ్లీ ఇవ్వబో యాను...."మాకేటి పండగబాబు దిన దినం సావే.....నిన్నంతా....కాయిలా...." దగ్గు తున్నాడు..."పాపం, ఫరవాలేదు దగ్గరుంచు" బలవంతాన ఇచ్చేసాను. కళ్లకద్దుకోబోతే, గాలికి ఎగిరిపోయింది ఒక నోటు పట్టు కొచ్చి ఇచ్చాను. "దేవుడివి బాబు నీవు" అని కొన్నాడు. వాడి కళ్లల్లో ఎంతో ఆనందం కనిపించింది. తృప్తిగా నవ్వుకున్నాను.

# తప్పుచేశాను

13 వ పేజీ తరువాయి

సులో. ఇన్నాళ్లకు ఒక మంచి చేసాను.

మరునటిరోజు కూడ ఆఫీసునుంచి, వస్తూ లైటు స్తంభంవైపు చూసాను దూరా న్నించి. ఈరోజు ఎంతో ఆనందంతో వుంటా డనుకొన్నాను . .ఆశ్చర్యం. అతనులేడు. తను కూర్చోడానికి అనుకూలంగా ఎత్తుగా అమ ర్చుకొన్న రాళ్లు కూడ లేవు. చేతి క్కర కూడ లేదు. పాప కూడ కనిపించలేదు. వెలితిగా వుంది ఆ స్థలం. ఎందుకో మనసు ఆందో ళన పడుతోంది. ఏదో కీడు శంకిస్తోంది. బరువుగా....ఇంట్లోకి వెళ్లాను. ఖాళీగావుండి పోయిన అతనిచోటే చూసుకుంటూ...... ఇంతలో వెంకన్న వచ్చాడు. "వెంకన్నా! లైటు స్తంభంక్రిందుండే ముసలివాడు, పసిపాప ఏమయ్యారో తెలుసా?" అన్నాను. "నిన్న రాత్రి చచ్చిపోయాడు బాబు. జనం అంతా అనుకుంటుంటె విన్నా"— ఆ మాటలు వినగానే హృదయాన్నంత కెలికివేసినట్లైంది "ఏమైందసలు!" ఆతురతో అడిగాను. "ఏముందిబాబు! ఆ ముసలాడికో విధవకొడు కుండాడు. రోజు కూలి, నాలి సేసుకొంటాడు. వచ్చిన డబ్బంతా తాగడానికి తగలేస్తాడు. ఇంటికే సరిగారాడు. రాక, రాక నిన్నరాత్రే బాగా తాగొచ్చేడు. గుడిసెలో ముసలాడి సేతిలో పది రూపాయలుసూసి ఎక్కడి దని గదమాయించాడు. వో దరమాత్ముడిచ్చాడన్నా ఇనక, దొంగతనం సేస్తుండావని బాగా తన్నాడు. నిషాలో. పానాలు గుప్పెట్లోపెట్టు కొని రోజులు గడుపుతున్న, ఆ ముసలాడు ఆటికి తట్టుకోలేక చచ్చిపోయాడు పాపం. లచ్చి ఒకటే ఏడుస్తోంది. ముసలాడు పోవం గానే, డబ్బుచ్చుకొని పరుగెత్తాడు ఆ ఎదవ".

ఇంక వెంకన్న మాటలు వినలేకపోయాను. తల తిరిగిపోతోంది. ఆ ముసలివాణ్ణి కొడుకు చంపలేదు. నేనే చంపేసాను. పది రూపాయ లిచ్చి అతన్ని నరకానికి పంపించాను. ఆ జీవితానికి, పది రూపాయల విలువకట్టా ఆదుకోవాలనుకొని, అంతమొందించ పసిపాపకు దిక్కు లేకుండా చేసాను...గుం మీద సుత్తితో కొట్టినట్లైంది. మీద, ఆ ముసలివాడు కనిపించడనగ ఏదో ఇష్టమైన దాని పోగొట్టుకొన్న పించింది......ఇంతలో పోస్ట్‌మాన్ వచ్చా "పోస్ట్" అంటూ...."ఎక్స్‌ప్రెస్ డెలివ లెటర్‌తో—ఆదుర్దాతో సంతకంచేసి తీ కున్నాను. అది నా భార్య దగ్గరను వచ్చింది. చేతులు వణకిపోతున్నాయ్. ఆం ళనతో అంతా చదివాను. నా భార్య సుఖం ప్రసవించిందికాని, బయటపడ్డ పసికం మాత్రం ఎప్పుడో కన్నుమూసాడు. మొదట ప్రసవించడం, చాలకష్టమైందట. బతి బయటపడుతుందనుకోలేదట. ఈ విషయ నాకు ముందుగా తెలిపితే, ఎంతగ ఆంద ళన పడిపోతానో అని, టెలిగ్రామ్ ఇవ్వ దట—వెంటనే రావలసిందని మరి మ వ్రాసింది .. ఏం చేయాలో అర్థం కాలేదు నాభార్య గండంనుంచి బతికి బయటప నందుకు సంతోషపడ్డాను. వెళ్లి ఆమెన పల్కరించాలి. నా నాలుగేళ్ల పాపను చూడాలి నా పాప గుర్తు రాగానే లైటు స్తంభం క్రింద ముసలివాడితోవుండే పాప లచ్చి కూడ కళ్లల్లో మెదిలింది. గిర్రున నీళ్లుతిరిగాయ్. ఒక్క క్షణం ఆలోచించాను—"వెంకన్నా! నా సామాన్లన్నీ . .సర్దెయ్! వెంటనే వూరికి వెళ్లిపోవాలి" అన్నాను—"బాబు...!" వెంకన్న ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. "ఔను. వెళ్లి పోవాలి....అంతేకాదు. ఆ ముసలివాడితో పాపను కూడ నా వెంట తీసుకెడతాను...." అన్నాను. "ఏంది బాబు నీవనేది...?" మళ్లీ అడిగాడు. ..నన్ను ఆపాలని వాడి ఉద్దేశం... "ఔనా! బహుశ ఇంక తిరిగి ఈ వూరు రానేమో...." అన్నాను..."మీ ఇట్టంబాబు. నేను ఏం చెప్పను..." సామాను సర్దేస్తు న్నాడు... అంతరాళంలో నేచేస్తున్న పని మంచిదని హృదయం ఘోషించింది. నాకు ఇప్పుడు ఇద్దరు పిల్లలు. బాధ్యత పెరిగింది. పసిపాప లచ్చితో బయలుదేరాను.

ఈనాటికి కూడ ఎక్కడున్నా గాంధిగారి విగ్రహం, సందు చివరన లైటు స్తంభం, బిచ్చం అడుక్కొనే ముసలివాడు, పసిపాప అను చూస్తుంటె ఆనాటి నా అనుభవం



# పుస్తకాలు

## సత్యవతి

నవల. రచయిత శ్రీ ద్వివేదుల విశాలాక్షి, క్రౌను 243 పుటలు. వెల అయిదు రూపాయలు ప్రకాశకులు: దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, శరత్ బిల్డింగ్సు, విజయవాడ—2.

మధ్యతరగతికి చెందిన సత్యవతి అనే దురదృష్ట వంతురాలి జీవిత చరిత్ర ప్రధానంగా యీ నవల వ్రాయబడింది. "ఏ అనుభవం లేకుండా అంతా ఊహించి వ్రాయడంకన్న వేనెరిగిన వాస్తవిక ప్రపంచంలో—ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాల్లోంచి కొన్ని పాత్రలను ఏరుకొని వారిని, వారిజీవితాలనూ, మనస్తత్వాలనూ, ఆ వాతావరణాన్ని సహజ సంఘటనలతో, స్వభావసిద్ధంగా చిత్రిస్తేనే మంచిదని భావించి" రచయిత దీన్ని వ్రాసినట్లు 'నామాట' లో ఉన్నది. ఇందులో రచయిత తెలిపినట్లే మధ్యతరగతికి చెందిన కుటుంబాలలోని మనస్తత్వాలూ, జీవితాలూ చక్కగా చిత్రించబడినవి. పాత్రలు విశాఖజిల్లాకు సంబంధించినట్లు రచయిత కూర్చారు పుస్తకం ఆమూలాగ్రమూ విశాఖమండల వ్యవహారభాష ఉపయోగించ బడినది. కవికి చిత్రకళమీద ఆసక్తి అధికంగా ఉన్నట్లు తెలుస్తున్నది. ఏదో అవకాశం కల్పించుకుని చిత్రకళను గూర్చిన వివరాలు—పాఠకులకు విసుగు కలిగించేటంతవరకూ వివరించారు. నవలలోని సంఘటనలు చాలావరకూ స్వాభావికంగా ఉన్నాయనే చెప్పాలి అయినా కథానాయిక అయిన సత్యవతికి ఆదినుండీ అంతంవరకూ—తప్పని సరిగా కష్టాలే కలుగుతూ ఉన్నట్లు చూపడం, అందులోనూ తన రక్షణలో ఎంతో జాగ్రత గా మెలగి, మంచివాళ్లనిపించుకొనే తనకొడుకులే అవిధేయతగా ప్రవర్తించడం, ఇంటి నుంచి పారిపోయిన సవతికొడుకే ప్రాణాపాయ సమయంలో ఆదుకోవడం కొంత విచిత్రంగానే కానవస్తుంది. అనధామలు, తన్నే నమ్ముకుని, ఎంతో భయభక్తులతో మెలగుతూ ఉన్న రెండవభార్యకూ, ఆమె సంతానానికీ తన ఆస్తిలో హక్కులేకుండా, మొదటిభార్య కుమారుడు చంద్రానికే చెందవలసినట్లుగా వీలునామా వ్రాయడానికి రచయిత కారణం చూపలేదు. సత్యవతమ్మ దిక్కులేని స్థితిలో విజయనగరం చేరుకుని, తిండిలేక ప్రాణాలు పోయేస్థితిలో ఉన్నప్పుడు, చిత్రకళను అభ్యసిస్తున్న విద్యార్థులు ఆమెను మోడల్గా ఉంచుకుని చిత్రాలు గియ్యడమూ, బలహీనతవల్ల మూర్ఛపోయిన ఆమెకు తెలివివచ్చిన పిదపకూడా ఆమెను ఆర్టుస్కూలులోకి తీసుకొనిపోయి బల్లపైన ఎంతోసేపు నిలబెట్టి స్కెచ్లు తీసుకోవడమూ సహజంగా ఉన్నట్లు తోచదు. ఎంతోసేపు ఆమెదగ్గరే ఉండి, నిదానించిచూస్తూవున్న ఆర్టు మాస్టరు చంద్రం, ఆమె తనకీపవలితల్లియే అని గ్రహించలేక పోవడం వింతగానే కానవస్తుంది ఇలాటి లోటుపాట్లు కొద్దిగా కానవస్తున్నప్పటికీ రచన ఆకర్షణీయంగానే ఉండి, పుస్తకం ముగిసేవరకూ చదవాలనే ఆసక్తిని కలిగిస్తూ ఉన్నది మధ్యతరగతిలో సంకుచిత మనస్తత్వాలు గలవారిలో మార్పు కలిగించడానికి ఇట్టి నవలలు మిక్కిలి అవసరంగానే కానవస్తున్నది. అచ్చూ, కాగితమూ, అట్టా [illegible]

—[illegible]

## నాటికలు

(పది తెలుగునాటికల సంకలనం).— సంకలనం: ముద్దుకృష్ణ సాహిత్య అకాడమీ పక్షమున ప్రచురణ: యం శేషాచలం కంపెనీ మద్రాసు మచిలీపట్నం సికింద్రాబాద్, పేజీలు 247, సాధారణ వెల రు 3-00 మేలు ప్రతి రు 3-50.

ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు సాహితీ నందన వనంలో పూచిన క్రొత్తపువ్వు నాటిక. సంస్కృత సాహిత్యంలో భాణము, వీధి, ప్రహసనము ఇత్యాది ప్రక్రియ లున్నప్పటికీ, సమకాలీన ప్రపంచంలో బహుళ ప్రాచుర్యం సంపాయించుకొన్న 'నాటిక' మాత్రం, ఆంగ్లసాహిత్య సంపర్కం మూలాన పుట్టినటువంటిదే. పారిశ్రామిక పరిణామ ప్రభావమూ, రూపొందించుకున్న నాటికను తక్కువకాలంలో ప్రదర్శనం ముగియడమూ, రచనలో కనిపించే వేగమూ—ఇవి నాటికను ఈనాటి జనత ఆదరించడానికి గల కారణాలు. సంస్కృతంలో భాసమహాకవి, ఆంగ్లభాషలో మేరీ పాకింగ్టన్, హెరాల్డ్ బ్రిగ్హౌస్, జేమ్సు కాటెన్బెల్, పిక్రాంట్, ఓనీల్ మొదలైనవారూ, రష్యన్ సాహిత్యంలో చెకోవ్, స్కాండినేవియన్ భాషల్లో ఇబ్సెన్, ఫ్రెంచి భాషలో మొలియర్, అనేక రకాలుగా నాటికను పరిణతికి తీసుకువచ్చారు. తెలుగుభాషలో కూడా నాటికను పరిపుష్టం చేయడానికి గత నాలుగైదు దశాబ్దాలుగా చెప్పుకోదగిన సంఖ్యలోనే రచయితలు ప్రయత్నాలు చేశారు. కొంతమంది కృతకృత్యులయ్యారు కూడాను నిజానికి వాఙ్మయచరిత్రను దిక్సూత్రంగా పరిశీలించడానికి సంకలన గ్రంథాలు ఎంతగానో తోడ్పడతాయి. 'నాటికలు' పది తెలుగు నాటికల సంకలన గ్రంథం. మొట్టమొదట గా ఒక సంకలన గ్రంథం శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి సంపాదకత్వంలోనూ (నాకు జ్ఞాపకమున్నంతవరకు), తరవాత డా॥ పెద్దిభట్ల శ్రీ పూర్ణా సంపాదకత్వంలో మరో సంకలనమూ మొన్నమొన్న ఒకటిరెండు చిన్న సంకలనగ్రంథాలూ తెలుగులో వచ్చాయి ఆంగ్లభాషలో ఏ ఏటి కాయేడు, రంగస్థలం మీద ప్రదర్శింపబడి, రచనలో కూడా ఉత్తమమైననేనని విమర్శకులచే నిర్ణయింపబడిన నాటికలు, "Best one act Plays of the year" అనే పేరుతో సంకలన గ్రంథాలుగా వెలువడుతూ ఉన్నవి. కాని, తెనుగుభాషలో ప్రతి సంవత్సరం గణనీయమైన సంఖ్యలో రచింపబడి ప్రదర్శింపబడుతున్న నాటికలను, ఏర్చికూర్చి ఏ సంవత్సరానికా సంవత్సరం పుస్తకాలుగా ప్రచురించే ప్రయత్నం ఇంతవరకూ జరుగకపోవడం మాత్రం విచారించవలసిన విషయం. ఈ విషయాన్ని ఆంధ్ర సాహిత్య అకాడెమీవారో, ఆంధ్రనాటక కళాపరిషత్తు వారో, పెద్ద పెద్ద పుస్తక ప్రచురణ సంస్థలో వీలయినంత త్వరలో చేపట్టవలసి వుంది.

ఈలోపున్ని కొంతలో కొంతగానైనా తీర్చవలెనని గాబోలు, సాహిత్య అకాడెమీవారి పక్షమున శేషాచలం కంపెనీవారు ప్రచురించగా, ప్రసిద్ధ నాటికాకర్తలు శ్రీ ముద్దుకృష్ణ, పది నాటికలను ఈ పుస్తకంలో సంకలనం చేశారు అయితే దురదృష్ట వశాత్తు శ్రీ ముద్దుకృష్ణ తమ రాగద్వేషాలకు అతీతంగా ఈ పని నిర్వహించినట్లు కనబడదు. శ్రీ ముద్దుకృష్ణగారు ప్రముఖ నాటికా రచయితలే గావచ్చును, కాని ఒకరు, "తెనుగుభాషలో వున్న పది మంచి నాటికలను మీరు చూపించండి" అని అడిగినప్పుడు, తన రచనను కూడా అందులో ఒకటిగా చూపించడం, వారి ఆత్మ విశ్వాసమును ఎత్తి చూపించవచ్చును గాని, ఆ ఔచితిని మాత్రం పాటించినట్లు కాదు. ఈ తరం నాటికా రచయితలలో చాలామందిని వదిలి వేయడం కూడా ఏమీ బాగాలేదు. ప్రచురణకర్తలు, గ్రంథ వివరణ పరిచయ వాక్యాలుగా, "నాటికా రచనలో పైపై వాటము కలిగిన సుప్రసిద్ధ రచయితలు వ్రాసిన పది నాటికలు ఇందులో అందాలు దిద్దు



స్వచ్ఛము, రుచికరమైన
**బుల్ బుల్**
బ్రాండ్
**ఇంగువ**
అత్యుత్తమమైనది

BULBUL
Brand
WARRANTED

అన్ని దుకాణములలోను దొరకును

---

USE ALWAYS...
**Neel-Kaal inks**
ఎల్లప్పుడు వాడండి...
**నీల్‌కాల్ సిరాలు**
IS: 1221

MADE IN ALL COLOURS BY: KALA PARISHAT, GUNTUR (A.P.)

---

**మా నూతన ప్రచురణలు**

రామాయణము

ఉషశ్రీ
రేడియో
రామాయణం
వెల:
రు/15.00

**సి. ఆనందారామం**

| | |
|---|---|
| జాగ్రుతి | 6·00 |
| అజ్ఞాత బంధాలు | 6·00 |
| దశావతారములు | 6·00 |
| మమతల కోవెల | 6·00 |
| మారే కాలంలో - మారని విలువలు | 6·00 |

**కావిలిపాటి విజయలక్ష్మి**

| | |
|---|---|
| చాకులాంటి పిల్ల | 6·00 |
| అపశృతులు | 6·00 |

పై వాటిలో ఏ మూడు పుస్తకాలకు M.O చేసినా పోస్టేజీ ఉచితం V P P పద్ధతి లేదు!

**న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్**
ఏలూరు రోడ్డు :: విజయవాడ-2
PHONE: 74677

---

**కీళ్ళ నొప్పా?**

**బాధ నివారణ కోసం**
**అయొడెక్స్**
**రుద్దటం అవసరం**

ఇతర ఆయింట్‌మెంట్స్ మీకు బాధనుంచి ఉపశాంతిని ఇయ్యవచ్చు. అయొడెక్స్ ఉపశాంతినిస్తూ, బాధను నివారిస్తుంది. దీనిలో అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ, కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక ఆయింట్‌మెంట్-అయొడెక్స్.

IODEX
cum Methyl Salicylate

**అయొడెక్స్ మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.**

లింటాస్-IODEX.4-75 TL





**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**

# ఇంటి గుమ్మాన్నిచూచి ఇంటిని చెప్పుకోవచ్చు



**విశ్వప్రేమి:**
ఇంటికి అందరూ రావాలి అంటుంది.
కొలువు అయిన తరువాత ఆవిడదావడి
శుభ్రంగాతీర్చి దిద్దినట్లుంటుంది.





**విశ్వప్రేమి:**
వాస్తవంగా అతిథులను ఆహ్వానించడం
తెలుసు. చీకూచింతా వుండదు. ఇల్లు
ఎప్పుడూ శుభ్రంగా ఉంటుంది.






**విశ్వప్రేమి:**
ప్రతీవ్యక్తికి ప్రేమతో స్వాగతము
పాలవాడికి కూడా.







**విశ్వప్రేమి:**
కొడుకు స్నేహితులందరూ
కాళ్లుతుడుచుకొని వస్తారు లోపలకు





**స్వాభిమాని:**
కూపస్థమండూకము గుమ్మలలోకి ఎవరు
వచ్చినా విసుగు. ధూళి, మన్ను
తెస్తారని గొణుగుతుంది.



ఇరుగుపొరుగువారి దగ్గరనుంచి ఈపిడ
కొన్ని విషయాలు నేర్చుకోవచ్చు —
ఉదాహరణకు కాళ్లుతుడుచుకొనే కోయర్
డోర్ మ్యాట్సు వాటి ఉపయోగము.

## కోయర్ డోర్ మ్యాట్సు

ఎంతతొక్కినా అందంచెడని డోర్ మ్యాటులు



కోయర్
బోర్డు
కొచ్చిన్ 682016

త్వరగా కోయర్‌కి అలవాటు పడండి దగ్గరి కోయర్ డీలర్ దగ్గరికివెళ్లి
కోయర్ బోర్డు షోరూమ్ & సేల్స్ డిపో, బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా,
మద్రాసు, బెంగళూరు, కొచ్చిన్, మధురై, ఛండీఘర్, భువనేశ్వర్, పాట్నా,
హైదరాబాదు, మరియు దేశమంతటా అనుమతిపొందిన కోయర్ డీలర్లు

SISTA'S CB 4/75 TEL

# నాటక సినీ రంగాలలో రామతిలకం



రామతిలకం ప్రస్తుతం చిలక–గోరింకలో నటిస్తోంది

ఎవరీ నారీతిలకం? అశేష విశాలాంధ్రుల ప్రశంసలందుకొని, ప్రేక్షకులను గిరాత లాగించిన ఒకనాటి రామతిలకమూ కాదు ఆనాటి దాసరి తిలకం కాదు ఈమె యం రామ తిలకం అలా అన్నా ఎవరికీ తెలియక పోవచ్చు కాని 'పెంకిపిల్ల' తిలకమంటే సులభంగా తెలుస్తుంది ఆమె నిత్యజీవితంలో అల్లరి చేస్తూ తిరిగే 'పెంకిపిల్ల' అనికాదు శ్రీ బి వి రామానందం దర్శకత్వంలో నిర్మించిన 'పెంకిపిల్ల'–చిత్రంలో కథానాయకి అందుకే 'పెంకిపిల్ల' తిలకం అంటారు

శ్రీ చిన్నయ్య, శ్రీమతి రాజేశ్వరిగారలకు వర ప్రసాదం రామతిలకం నటనాచాతుర్యం ఈమె వారసత్వం గానే వచ్చింది తల్లి రాజేశ్వరి యిప్పటికీ తెలుగునాటకరంగంలో తనసామర్థ్యాన్ని చూపుతునే వుంటుంది నటనలో తిలకం తనతల్లి అడుగుజాడల్లో నడిచి తల్లికి మించిన పిల్ల అయింది

ఈమె జన్మస్థలం బ్రాహ్మణకోడూరు పసితనంనుండి ఈమెకు నటనయందు అభిలాష చాలఎక్కువ ఊహతెలిసిననాటి నుండే ఈమె లోహితాస్యునిగా, చిన్న కృష్ణుడుగా నాటకాలలో వేషాలు వేస్తూండేది ఈవేషాలకు సమాజంవాళ్ళు కిరాయి యిచ్చేవాళ్ళు ప్రేక్షకులు, కొన్ని నాటక సమాజములవారు పెన్నులు, పటికబెల్లం పొట్లాలు బహుమతులుగా యిచ్చేవారు ఈమెకు చిన్నప్పటినుంచీ వేషాలవలన అర్జన ఆరంభమైంది ఈమె గాత్ర మాధుర్యానికి ఆరోజుల్లోనే చాలమంది పెద్దలు ఆశ్చర్య పడేవారు

అదే నాటకవాతావరణంలో పెరగడం వల్ల ఈమెకు ప్రాయంతోపాటు నాటకకళా జ్ఞానం, నటనా ప్రావీణ్యత కూడావృద్ధి చెంది ఇంద్రధనుసులా పెరిగింది

నాటకరంగంలో యీమె మొదటిసారిగా 'తుక్కాబాయి' లో కథానాయకిపాత్ర ధరించింది పువ్వుపుట్టగానే పరిమళించిందన్న ట్లు ఆనాడే యీమె విశిష్టత పలువురి చెవుల్లోకి ప్రాకిపోయింది

శ్రీ వేదాంతకవిగారి, 'తెలుగుతల్లి' నాటకంలో 'భారతి' వేషంవేసిపండిత పామరుల చేతకూడ శభాష్ అనిపించుకుంది

1949 లో ఆంధ్రనాటక కళా పరిషత్‌వారు ఏలూరులో నాటకాలపోటీలు జరిపేరు 'పరితాపం' నాటకంలో కథానాయకిగా వేసింది ఆసంవత్సరం పరిషత్ జడ్జీలుగా మాధవపెద్ది వెంకట్రామయ్య, స్థానం గోవిందరాజులు సుబ్బారావు, డి వి సుబ్బారావు, స్థానంనరసింహారావు, బందా కనక లింగేశ్వరరావుగార్లున్నారు ఉత్తమ నటిగా తిలకంను ఎన్నిక చేశారు ఈమె ప్రజ, పాటవం మరింత విస్తృత మయింది ఆంధ్రదేశంలో పలుచోట్ల మరికొన్ని నాటకాలలో ఈమె నటనాశక్తిని చూపించే అవకాశం కలిగింది

అమలాపురంలో శ్రీపినిసెట్టి శ్రీరామమూర్తి వ్రాసిన 'కులంలేనిపిల' నాటకం ప్రదర్శన జరిగింది ఆనాటకప్రదర్శనలో యీమె నటనను ప్రముఖ తెలుగు చలన చిత్రహాస్య నటుడు శ్రీ శే జోగారావుచూశారు ఈమె నటనకంటే గానమాధుర్యం అతనిని ఎక్కువగా ఆకర్షించింది జోగారావు శ్రీ బి వి రామానందంగారికి నేపథ్య గాయనిగా పరిచయం చేశారు కాని శ్రీ రామానందంగారు ఈమెముఖకవళికలూ వాటిలోగల భావప్రకటనాశక్తిని చూసి, తనుతీయబోయే 'పెంకిపిల్ల' చిత్రానికి కథానాయకిగా ఎన్నుకున్నారు ప్రథమ సోపానంలోనే ఈమె చిత్రరంగంలో కథానాయకిస్థానం అలంకరించుకుంది కాని కాలగమనంలో యీమె చిత్రరంగానికిదూర మైంది అయినా యీమెలో ఉత్సాహం

చేయించారు. కాని, ఆ పలక ఉన్నట్టుండి పగిలిపోయింది. చూచినవారంతా "అశుభం" అన్నారు. ఇహ చదువు రాదన్నారు. కాని, పగిలిన ఆ పలక ముక్కలే తిరిగి ఏకం అయ్యాయి. వాసంతి బి. ఏ. పాసయ్యారు. 'లా' చదువుతూ, చదువుతూ, సినీ జీవితానికి వెలుగుబాటలు వేశారు.

న్యాయశాస్త్రం చదివిన వారికి సినిమా జీవితం ఏమాత్రం నచ్చదు. కారణం : న్యాయా న్యాయాలకు, యీ సినిమా రంగం అతీతం. అందుకే "మీ కీ లైఫ్ నచ్చిందా?" అని అడిగాను.

"బాగా నచ్చింది. నా 'ఫ్రెండ్స్' అంతా మంచివారు" అన్నారు చిరునవ్వును విరియ బోస్తూ!

**ఆశయాలకు ఒరవడి**

వాసంతి, తొలుత 'డాక్టర్' కావాలని తెల్లని దుస్తుల్లో మెరిసిపోవాలని, ఆమె తలి తండ్రులు కలలు కన్నారు. కాని, ఆమె తనఅభిరుచికి తగినట్లు నటిఅయ్యారు. ప్రస్తుతం 11 చిత్రాలలో నటిస్తున్నారు.

చేపట్టిన కార్యాన్ని సాధించటం విజ్ఞుల లక్షణం. నటి జీవితాన్ని ఆరంభించి, ప్రతిగ మార్గాన సాగిపోతున్న వాసంతి తన లక్ష్యానికి చేరువలోనే ఉన్నది. తామేం చేయదలచుకొన్నారో, ముందుగానే యోచన చేశారు. తమ గమ్యం ఏమిటో ముందుగానే ఊహించారు!

గమ్యాన్ని చేరుకోగలమని, తారాపథంలో అగ్రతారంబాలాలను అందుకోవగల నని వాసంతి విశ్వాసం. ఫ్యాక్టరీల్లాగా, లెక్కకు మించినన్ని పాత్రలు వేయటం ఆమెకు మనస్కరించదు. కాని, చేసిన ప్రతిపాత్రకు విలువనివ్వాలని వాసంతి సంకల్పం, ఆశయం.

**వాసంతి బి. ఏ.**

చలన చిత్ర రంగంలో ప్రవేశించాకనే చాలామంది "పెద్ద బాల శిక్షలు" చదువు కొనే యీ రోజుల్లో ఒక విద్యావతి— అందునా బి. ఏ. పట్టం పుచ్చుకున్న యువతి విద్యానంతరం నటి కావటం తెలుగు తెరకు శుభ సూచకం.

విద్య సంస్కారాన్ని, ఆలోచనా శక్తిని ప్రసాదిస్తుంది. ఉచితానుచితాలమధ్య నుండే తారతమ్యం చెప్పగలిగేది విద్య. నటి వాసంతి పలికే ప్రతి పలుకులో వినయం సంస్కారం, మంచితనం కనపడుతున్నాయంటే, వాటికి ప్రాతిపదిక 'విద్య' గాక మరేం అవుతుంది?

వాశిరాజు ప్రకాశం ●

ఫొటో - ప్రభాకర.



వాసంతి బి. ఏ.



నటి వాసంతి.



హిందీ 'మూగమనసులు' షూటింగ్ సందర్భంలో నటి నూతన్‌తో సంభాషిస్తున్న దర్శకులు శ్రీ ఆదుర్తి సుబ్బారావు

# సినిమా వార్తలు

## హైదరాబాద్ మూవీస్ అర్ధరాత్రి

హైదరాబాద్ మూవీస్‌వారు తాజాగా సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు జనవరి 13వ తేదీని వాహినీస్టూడియోలో శాంత కాంతతో శాస్త్రయుక్తమైన పూజతో చిత్రం షూటింగ్ ప్రారంభించారు ఆరోజు యీ చిత్రంలో కథానాయకిగా కనిపించనున్న భారతితో చిత్రీకరణ చేశారు హైదరాబాద్ మూవీస్‌వారు యిదివరకు ఎన్నడూ ముహూర్తాలు, పూజలు చేసి చిత్రాల షూటింగ్ ప్రారంభించలేదు ఈ చిత్రానికి 'అర్ధరాత్రి' అని నామకరణం చేశారు

ప్రారంభోత్సవానికి శ్రీయుతులు జగ్గయ్య, సి యస్ రావు మొదలగు ప్రముఖులు హాజరైనారు ఈ చిత్రంలో కథానాయకుడు జగ్గయ్య కొన్ని చిత్రాలలో మనకు సాత్విక పాత్రలలో కనపించే నిర్మల యీ చిత్రంలో పరమ గయ్యాళి వేషం వేస్తుంది

నలుగురు క్రొత్త యువతీ యువకుల్ని కూడా యీ చిత్రం ద్వారా వెండి తెరకు పరిచయం చేయాలని నిర్మాత శ్రీ పి గంగాధరరావు అన్వేషిస్తున్నారు

రచన—ఆరుద్ర, సంగీతం—కోదండపాణి ఈ చిత్రానికి దర్శకత్వం నూతన దర్శకుడు పి సాంబశివరావు వహిస్తున్నారు

## నూతన్ గానం

ఆత్మా ఆర్ట్స్ అధినేత శ్రీ ప్రత్యగాత్మ తన స్వంత చిత్రం 'చిలకా—గోరింకా' నిర్మాణం చివరి దశలో ఉంది ఈ చిత్రంలోని ఒక ముఖ్యమైన సన్నివేశంలో 'కల' ఉంది కలలో పాట కృష్ణకుమారి, కృష్ణంరాజు, వాసంతితో చిత్రీకరిస్తారు

ఈ పాటను శ్రీ శ్రీ వ్రాశారు ప్రముఖ హిందీ నటి నూతన్, పి సుశీల, జానకి, జయదేవ్ పాడగా రికార్డింగ్ చేశారు

ఈ చిత్రానికి కావలసిన పాటలు అన్ని శ్రీశ్రీ వ్రాశారు సంభాషణలు—ఆచార్య ఆత్రేయ వ్రాశారు. సంగీతం—టి వి చలపతిరావు నిర్మాత, దర్శకుడు—కె ప్రత్యగాత్మ

## పాదుకాపట్టాభిషేకం

అమరావతి చిత్ర వారి 'పాదుకా పట్టాభిషేకం' చిత్రానికి యీ నెలలో ఎనిమిది రోజులు షూటింగ్ జరుగుతుంది ఫిబ్రవరి నెలతో యీ చిత్రంపూర్తి అవుతుంది

ఈ చిత్రంలో కాంతారావు, బాలయ్య, నూతన నటుడు శశికాంత్, నాగరాజా, ధూళిపాళ, రమణారెడ్డి, కృష్ణకుమారి, జయంతి, లీలావతి, మాలతి, విద్యావతి, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు హరనాథ్, వాణిశ్రీ గెస్టు ఆర్టిస్టులుగా నటిస్తున్నారు ఈ చిత్రానికి సంగీతం ఘంటసాల సమకూరుస్తున్నారు దర్శకత్వం : టెక్నికల్ యూనిట్

## రాజలక్ష్మిలో కృష్ణ-జయలలితలు

రాజలక్ష్మివారు తాజాగా నిర్మించనున్న సాంఘిక చిత్రానికి రచన ఆరుద్ర, కథానాయకుడుగా కృష్ణ (తేనె మనసులు) నాయకిగా జయలలితలను ఎన్నుకున్నారు మిగతా తారాగణం ఎన్నిక జరుగుతుంది

ఈ చిత్రానికి దర్శకత్వం—శ్రీ మల్లికార్జునరావు వహిస్తారు నిర్మాతలు—సుందరలాల్ నహతా,డూండీ

## భక్తప్రహ్లాదకు మరోపాట రికార్డింగ్

ఏ వి యం వారు తెలుగులో నిర్మిస్తున్న 'భక్త ప్రహ్లాద' చిత్రం పూర్తిగా రంగులలో తీస్తున్నారు ఈ చిత్రానికి కావలసిన ఒకపాటను జనవరి 22 తేదీని శ్రీమతులు పి సుశీల, యస్ జానకిలు పాడగా ఏ వి యం లోనే రికార్డింగ్ చేశారు సంగీత దర్శకత్వం—యస్ రాజేశ్వరరావు వహించారు

ఈ చిత్రంలో యస్ వి రంగారావు, అంజలీదేవి, ధూళిపాళ, బేబి రోజారాణి మొదలగువారు నటిస్తున్నార

ఏ వి యం వారే తెలుగులో సాంఘిక చిత్రాన్ని కూడా నిర్మిస్తున్నారు ఈ చిత్రంలో రేలంగి, హరనాథ్, జి వరలక్ష్మి, జమున, బేబి పద్మిని మొదలగువారు నటిస్తున్నారు

## తెలుగులో కన్నడచిత్రం

'బెట్టద హులి' అంటే కొండ పులి అని అర్థం కన్నడంలో 'బెట్టద హులి' అనే చిత్రం విజయవంతమైంది ఈ చిత్రానికి దర్శకుడు అమంచర్ల శేషగిరిరావు కన్నడంలో విజయవంతమైన ఫైటు చిత్ర కథను ప్రముఖ తారాగణంతో తెలుగు, తమిళ భాషలలో శ్రీ అమంచర్ల శేషగిరిరావు తీస

కత్వంతో నిర్మించడానికి సర్వ సన్నాహాలు చేస్తున్నారు నటీనటుల ఎన్నిక జరుగగానే సెట్సుమీదకు వెళ్తారు

## తారాశశాంకం ఔట్‌డోర్ షూటింగ్

రామకృష్ణ పిక్చర్సువారు నిర్మిస్తున్న 'తారాశశాంకం' చిత్రం అవుట్‌డోరు షూటింగ్ యీ మధ్య జరిపారు ఈ షూటింగ్‌లో దేవిక, రామకృష్ణ, అల్లు రామలింగయ్య, బాలకృష్ణ, వాణిశ్రీ పాల్గొన్నారు

ఈ చిత్రంలోకి కావలసిన నాలుగు పద్యాలను కూడా రికార్డింగ్ చేశారు పద్యాలు పి బి శ్రీనివాస్, పి సుశీల, పి పి కోమల పాడగా రికార్డింగ్ చేశారు సంగీతం—శ్రీ టి వి రాజా సమకూర్చారు

ఇంకా యీ చిత్రంలో గుమ్మడి కాంతారావు, పి సూరిబాబు, లింగమూర్తి వగైరాలు నటిస్తున్నారు ఈ చిత్రానికి నిర్మాత—కె సత్యనారాయణ, దర్శకుడు—మానాపురం అప్పారావు

## సిటడల్ వారి చిత్రం రెండు సెట్సు పనిపూర్తి

సిటడల్‌వారు మళ్ళా తెలుగు చిత్రాన్ని నిర్మిస్తున్నారు ఈ చిత్రంలో రాజశ్రీ రామకృష్ణ నాయకీ నాయకులు ఇంకా యీ చిత్రంలో చలం, సూర్యకాంతం, రాజనాల, అదలవాడ కుటుంబరావు, రావికొండలరావు, జయంతి, వాణిశ్రీ మొదలగువారు నటిస్తున్నారు

ఇంతవరకు రెండు సెట్సు పని పూర్తి చేశారు రచన—ముద్దుకృష్ణ, సంగీతం—శివా సమకూరుస్తున్నారు సిటడల్‌స్టూడియో అధినేత, 'ముగ్గురు యోధులు' చిత్రం నిర్మాత—దర్శకుడు అయిన జోసఫ్ తలీఫ్ యీ చిత్రానికి నిర్మాత—దర్శకుడు ఈ చిత్రం వారి స్వంత స్టూడియో 'సిటడల్'లో నిర్మిస్తున్నారు.

## 'కన్నె మనసులు' పది రీళ్లు పూర్తి

బాబా మూవీస్‌వారి 'కన్నె మనసులు' చిత్రం యింతవరకు పది రీళ్ళు పూర్తి అయింది ఫిబ్రవరిలో జరిగే షూటింగ్‌లో స్టూడియోలో షూటింగ్ పూర్తి



'పరమానంద శిష్యులు'-కథలో కె. ఆర్. విజయ, ఎల్. విజయలక్ష్మి

అవుతుంది. మిగిలినదంతా అవుట్‌డోర్ షూటింగ్‌కు సంబంధించిన దృశ్యాలు. ఇంతవరకు ఎవరూ చిత్రీకరించని ప్రదేశాల్లో యీ అవుట్‌డోరు దృశ్యాలు చిత్రీకరిస్తారు.

ఇంతవరకు అయిదు పాటలను రికార్డింగ్ చేసి చిత్రీకరించారు. ఇంకా మూడు పాటలను రికార్డింగ్ జరిపి చిత్రీకరించాలి.

ఈ చిత్రంలో గుమ్మడి, రాంమోహన్, కృష్ణ, కృష్ణమూర్తి, కె. వి. చలం, వెంకటేశ్వరరావు చలపతిరావు, సుకన్య, సంధ్య, సూర్యకాంతం, పుష్పకుమారి మొదలగు వారు నటిస్తున్నారు.

కథ—ముళ్లపూడి వెంకట రమణ, సంభాషణలు—యస్. ఆర్. నంది సమకూర్చారు సంగీతం—కె. వి. మహదేవన్. నిర్మాత—సి. సుందరం. దర్శకుడు—ఆదుర్తి సుబ్బారావు.

—ధర్మశ్రీ ●



'ఆత్మగౌరవం'లో కాంచన, అల్లు రామలింగయ్య

# ఆంధ్రలో పర్యటనలు: ఎన్. టి. ఆర్. తో గోష్ఠి

ఏ నోట విన్నా ఆ మాటే — ఎన్ టి రామారావుగారు, తోటి కళాకారులూ చేస్తున్న కృషి అపూర్వమైనదని, సామాన్య ప్రజలే కాదు, విద్యావంతులూ ప్రశంసించగా విన్నాను 'తాము ఆకాశ హర్మ్యాలలోనే ఉండమనీ, జాతీయావసరమున్నప్పుడల్లా సర్వం దేశ కళ్యాణార్థం త్యాగం చేయడానికి సిద్ధంగా ఉంటా'మని నిరూపించడం ద్వారా రామారావు బృందం అశేష ప్రజ అభిమానాన్ని చూరగొన్నది

ఇంతేకాదు మరో మహత్కార్యాన్ని రామారావు సంకల్పించుకున్నారు వీలైనంత త్వరలో యుద్ధ ప్రాంతాలకు వెళ్లనున్నారు అక్కడ కవోష్ణ రక్తధారలను తర్పణ చేస్తున్న మన వీర సైనికులముందు కూడా ప్రదర్శనలిచ్చి వారిని సంతోషపరచి వారిలో ఆత్మోత్సాహాన్ని రేకెత్తించడానికి రసవత్తరమైన కార్యక్రమాన్ని రూపొందించనున్నట్లు తచయితతో చెప్పారు

"అగ్రస్థావరాలకు వెళ్లాలని ఉంది మన వీర సైనికులలో వివిధ భాషలవారున్నారు వారందర్నీ సంతృప్తి పర్చాలి ఆటా పాటిగా వెళ్లి తిరిగి రావడం నా ఉద్దేశం కాదు వారికి రసోద్దీపన కలిగే రీతిగా మా కార్యక్రమాన్ని రూపొందించుకుంటాము 'విజయం మనదే' నాటిక ఉంది దాన్ని డిఫెన్స్ షార్టుగా చిత్రీకరించి ప్రభుత్వానికి సమర్పిస్తున్నాను హిందీలో కూడా దాన్ని అనువదించబోతున్నాము సంగీతం, నాట్యం, వంటి రసవత్తరమైన కార్యక్రమాలతో వెళ్లవలసి వుంటుంది" అని రామారావు ప్రత్యేక గోష్ఠిలో వెల్లడించారు రాష్ట్రంలో 22 రోజుల నిర్విరామ పర్యటన అనంతరం రామారావును కల్సుకున్నప్పటికీ, ఆయన ముఖంలో తేజస్సూ, ఆవేశ ఉద్వేగాలూ కనిపించాయి యుద్ధ ప్రాంతాలకు రామారావు తమ బృందంతో ఎప్పుడు వెళ్లేది ఇంకా నిర్ణయించుకోలేదు మరో ముఖ్య విషయాన్ని కూడా ఆయన తెలియజేశారు

దేశ సరిహద్దుల్లో పరిస్థితులు మరింత విషమిస్తే మళ్లీ రాష్ట్ర పర్యటనకు ఆయన పూనుకోనున్నారు ఈసారి ఇంత పెద్ద బృందంతో వెళ్లకపోవచ్చు "కొద్దిమంది కళాకారులతో వూరూరికి వెళ్తాను ప్రదర్శన లిస్తాను ప్రజలను మరింతగా ఉత్తేజితులను చేయడానికి కృషి చేస్తాను ఏ కళ ద్వారా ప్రజలు మమ్మల్ని అభిమానిస్తున్నారో ఆ కళ ద్వారానే వారిని ఉద్బుద్ధం చేయడానికి ప్రయత్నిస్తాను" అని కృతనిశ్చయంతో రామారావు చెప్పడం సంతృప్తిని కలిగించింది

డిసెంబరు 11 వ తేదీ భాగ్యనగరపు చరిత్రలోనేకాదు, తెలుగు చలన చిత్ర పరిశ్రమలోనే అపూర్వమైన రోజుగా భావిస్తాను పుర జనులలో సమోత్సాహం వెల్లివిరిసినది ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రిగారు అతోజే ఫతే మైదాన్ స్టేడియంలో లక్షలాది ప్రజలను ఉద్బోధించారు స్టేడియంకు కుడివైపునే ఉన్న నిజాం కాలేజి మైదానానికి సాయంత్రం నాలుగు గంటలనుంచీ జన సముద్రం ప్రవహించసాగింది చంకలో పసికందులతో తల్లులు, పిల్లలతో తండ్రులు, మనుమరాళ్లతో ముసలవ్వలూ, మనుమలతో తాతలు, చిలకా గోరింకల్లా దంపతులూ, గుంపుల్లో యువతీ యువకులూ, సూట్లలో అధికారులూ, లాల్చీలలో అనధికారులూ, వయోభేదమూ, అంతస్తుల వ్యత్యాసమూ లేకుండా విచ్చేసారు నిజాం కాలేజీ మైదానం కేరింతలతో, కిలకిలస్వనాలతో ప్రతిధ్వనించసాగింది

ప్రధాని శాస్త్రి సతీమణి లలిత, ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి సతీమణి రాఘవమ్మ, మిగతా మంత్రులు నిర్ణీత సమయానికి వచ్చారు సింహద్వారంవద్ద రామారావు, తదితర కళాకారులు వారికి స్వాగతం చెప్పారు మైదానంలోనికి ప్రవేశిస్తుండగా నటీమణులు వారిని పూల జల్లులతో ముంచారు ఘంటసాల ప్రార్థన గీతంతో ఈ కళోత్సవం ప్రారంభమైంది దేవికా లక్ష్మీరాజ్యం, గీతాంజలి, శాస్త్రి దంపతులకు మంగళ హారతులు పట్టారు రెవిన్యూ మంత్రి శ్రీ మాకల రామచంద్రారెడ్డి ఈ మహాసభకు అధ్యక్షత వహించారు ఎన్ టి రామారావు ప్రధానికీ, ముఖ్యమంత్రికీ, రెవిన్యూమంత్రికీ స్వాగతపత్రాలు సమర్పించారు తర్వాత తోటి కళాకారులను పరిచయం చేశారు ప్రధాన అతిథులను కళాకారులందరూ పూలమాలలతో ముంచెత్తడం ముఖ్యమంత్రి చూసి ఆశ్చర్యాన్ని చిరుహాసంతో సంజ్ఞామాత్రంగా వెలిబుచ్చగా, "మాకు అవకాశ మివ్వండి మనసారా సన్మానించుకోవాలని ఉంది" అని రామారావు అన్నప్పుడు సభలో చిరునవ్వులు విరిసాయి ప్రధానికి ముక్కామల పాదాభివందనం చేశారు

## ఎనిమిది లక్షలు సమర్పణ

ఉద్రేకపూరితమైన కంఠంతో రామారావు స్వాగత పత్రాలన్నింటినీ చదివి వినిపించారు అనంతరం, 21 రోజుల పర్యటనలో సేకరించిన 8 లక్షల రూపాయల ద్రవ్యాన్ని చెక్కు రూపంలో ప్రధాని శాస్త్రికి సమర్పించారు ఎస్ వి రంగారావు, కాసు బ్రహ్మానందరెడ్డి సంయుక్తంగా ప్రధానికి చెక్కును అందజేశారు. నాలుగు బస్తాల మేరకు



హైదరాబాదు సభలో ఎన్ టి ఆర్ ప్రసంగం ఫోటోలో శ్రీ శాస్త్రి, శ్రీమతి శాస్త్రి కూడ ఉన్నారు.

రించిన నాణాలను స్టేజీమీద ప్రధానిముందు రాసులుగా పోశారు. లారీల కొద్దీ వసూలైన రకరకాల చీరెలు, పీతాంబరాలు, తాపుల పెళ్ళు, ఫ్లాస్కులు, కలాలు, వెండి బిందెలు, గిన్నెలు, ఫొటోలు వేదికపై అమర్చారు. వివిధ ప్రాంతాల్లో ప్రజలు సమర్పించిన బంగారు నగలు, గొలుసులు, ఉంగరాలను స్వర్ణమాలగా గుచ్చి ప్రధాని కంఠసీమను అలంకరింపచేశారు.

## ప్రధానిశాస్త్రి ప్రశంసలు విజ్ఞప్తి

కళాకారుల కార్యక్రమం గురించి తెలుసుకొని ప్రధాని పరమానందం వ్యక్తపర్చారు. చెక్కు స్వీకరణ అనంతరం శాస్త్రి మాట్లాడుతూ, "ఇటీవల ప్రజల్లో నేను ప్రసిద్ధుణ్ణయ్యాను. అయితే ఈ సినిమా కళాకారులు నాకంటే ఎక్కువగా జనంలో ప్రసిద్ధినీ, అభిమానాన్నీ చూరగొంటున్నారు (నవ్వులు). ఆ అభిమానంతోనే వారు ఈ ద్రవ్యాన్ని సమర్పించగలిగారు. ఈ స్వర్ణమాల కూడా నాకు బరువుగానే ఉన్నది (మళ్లీ నవ్వులు). వివిధ రూపాల్లో వీరు సేకరించి సమర్పించిన నిధి చాలా ఆనందం కలిగిస్తున్నది. మాతృదేశ రక్షణకు ప్రజలను ఉత్తేజితుల్ని చేయడానికి శ్రీ రామారావు, ఆయన మిత్రులు కావించిన కృషి చాలా గొప్పది. దేశంకోసం కళను ఇలా వినియోగించిన వీరందర్నీ అభినందిస్తున్నాను" అని అన్నారు. ఒక సూచన కూడా చేశారు. ఈ కళాకారులు వీలైతే యుద్ధప్రాంతాలకి వెళ్లి, దేశరక్షణకు ప్రాణాలర్పిస్తున్న వీర సైనికులముందు కూడా ప్రదర్శనలిచ్చి, వారిని సంతృప్తిపరచి, ఉత్సాహవంతులను చేయాలని శాస్త్రి కోరారు.

అంతకుముందు శ్రీ బ్రహ్మానందరెడ్డి మాట్లాడుతూ శ్రీ రామారావు అగ్రనటుడు కావడమేకాక, ప్రసిద్ధ సంఘ సేవకుడనీ, దేశ భక్తుడనీ కొనియాడారు. ఆయన లోగడ పెక్కు సందర్భాలలో కావించిన కృషిని ప్రస్తుతించారు. ఎన్. టి. ఆర్. బృందాన్ని అభినందించారు. స్వాగతోపన్యాసంలో శ్రీ మాకల రామచంద్రారెడ్డి (ఎన్. టి. ఆర్. ఎన్. డి. ఎఫ్. కమిటీ హైదరాబాదు అధ్యక్షులు) రామారావు సంఘసేవను, కళాసేవను ప్రశంసిస్తూ, ఆయన పాటిస్తున్న ఉత్తమాదర్శాలను ఇతరులు పాటించి ధన్యులు కావాలని అన్నారు.

అంతకుముందు ఎన్. టి. రామారావు గంభీర స్వరంతో "కేవలం నిధి సమర్పణే మా ధ్యేయం కాదు. అదే అయితే ఈ ఉద్యమమే అవసరంలేదు. ఉన్న చోటునుండే సమర్పించగలిగేవారం. ప్రజలను ఉత్తేజితుల్ని చేయడమే మా లక్ష్యం. ఎప్పుడు ఏ అవసరం వచ్చినా మా ప్రాణాలొడ్డి జాతి కళ్యాణానికి కృషి చేస్తామని ఈ అశేష ప్రజ ఎదుట, ప్రియతమ నాయకుల ఎదుట హామీ ఇస్తున్నాను" అని అభిభాషించారు. తమ సంకల్పాన్ని ఫలప్రదం చేసిన ఆంధ్ర ప్రజానీకానికి, తోటి కళాకారులకూ కృతజ్ఞతలు తెలియజేశారు.

అనంతరం శ్రీమతి రాజసులోచన అర్ధనారీశ్వర నృత్యంతో ప్రదర్శనలు ప్రారంభమైనాయి. భమిడిపాటి రాధాకృష్ణ రచించిన 'దంత వేదాంతం'—హాస్య నాటికలో యస్వీ రంగారావు, పెక్కులిసేని, ధూళిపాళ, కె. వి. యస్. శర్మ, రామకృష్ణ, శ్రీమతి ఛాయాదేవి పాల్గొన్నారు. ప్రధాని, ముఖ్యమంత్రి, వారి సతీమణులు ఈ నాటిక ప్రదర్శనను తిలకించారు.

ఆ తర్వాత ప్రస్తుత దేశ వాతావరణాన్ని ప్రతిఫలింపజేస్తూ, ఉత్తేజపర్చే 'జయం మనదే' నాటికను ఎన్. టి. రామారావు, దేవిక, లక్ష్మీరాజ్యం, ముక్కామల, పద్మనాభం, పేకేటి, బాలకృష్ణ తదితరులు ప్రదర్శించారు. ఈ నాటిక సమాప్తం కాగానే, నటీ నటులందరూ మహాసభలో ప్రవేశించి నిధి వసూలు చేశారు. దాదాపు ప్రతి ఒక్కరి వద్దకు వెళ్లారు. డబ్బు, వివిధ రకాలవస్తువులు సేకరించారు. కాటన్పింటేసి స్టేజీమీద రామారావు సదస్యులకు చూపించారు. పదేళ్ల బాలికలు, వృద్ధ మాతలు, యువకులు స్టేజీమీదికి వచ్చి రామారావుకు ఉంగరాలు, డబ్బు ఇచ్చారు. దేశంపట్ల, కళాకారులపట్ల ప్రజలు ద్యోతకపర్చిన అభిమానాన్ని చూస్తుంటే ముదావహం కలుగుతుంది. తర్వాత మధురశ్రీ వ్రాసిన చారిత్రాత్మక నాటిక 'దేశభక్తి'ని కాంతారావు, రాజనాల, వి. వి. సుబ్బారావు, శ్రీమతి సుమతి ప్రదర్శించారు.

డిసెంబరు 9నాడు సికింద్రాబాదులో, డిసెంబరు 10నాడు హైదరాబాదులో కళాకారులు నిధి వసూలు చేశారు. ప్రధాన వీధులగుండా వెళ్లి ప్రతి ఒక్కరివద్ద విరాళాలు సేకరించారు. కొందరు డబ్బు, కొందరు ఉంగరాలు, కొందరు నగలు, కొందరు పెన్నులూ, కొందరు గడియారాలూ ఇచ్చారు. కొందరు యువకులు ఒక నటితో కరచాలనంచేసి ఐదేసి రూపాయలు కూడా ఇచ్చారు. నిధి సేకరణోద్యమం కళాత్మకంగా సాగింది. కొన్ని కేంద్రాలలో సుమంగళులు మంగళసూత్రాలు కూడా విరాళమివ్వడం అపూర్వం. దాదాపు ఆరు మంగళసూత్రాలు చేకూరినవి. మంగళసూత్రాల విరాళం వెనుక, వసూలైన ప్రతి నాణెం వెనుక ఒక గాథ వున్నది. దేశరక్షణ దీక్షవున్నది. త్యాగం, ఉత్సాహం, దేశభక్తి ఉన్నది.

—బొసాని సుదర్శనరెడ్డి



'ఆత్మగౌరవం'లో కాంచన, నాగేశ్వరరావు













Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambu chetty Street Madras-1, Phones (Editorial), 21743; Other depts: 29766. Chief Editor: S. Sambhu Prasad.





"తల్లివి కాబోతున్నావు నువ్వు ఇద్దరి తిండి తినాలి మరి"

రోజూ ఒక్కో

# ప్రీనేటల్

కేప్స్యూల్ వేసుకో!

మె ఆరోగ్యం కోరి అమ్మ చెప్పిన మాటలో ంత అనుభవం వుంది! ఎందు కంటే కడుపులో డ్డ తల్లి నుంచే తన పోషకాహారాన్ని తీసు ంటుంది. తల్లికీ, బిడ్డకీ కావలసిన అత్యవసర దార్థాలు నిత్యమూ తినే తిండిలో లభించక ోవచ్చు. అందుకనే రోజూ ఒక్కో ప్రీనేటల్ ప్స్యూల్ వేసు కోడం చాలా మంచిది.

ీనేటల్ కేప్స్యూల్ సుగుణాలేవిటో డాక్టర్లందరికీ లుసు. ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు కాల ఖనిజ పదార్థాలూ సరైన పాళ్లలో కలిపి, ల్లికీ, బిడ్డకీ కావలసిన ఈ పోషకాహారాన్ని డర్లీ కంపెనీ ప్రత్యేకంగా తయారు చేసింది.

క్కో ప్రీనేటల్ కేప్స్యూల్ వేసు కుంటే ుకు. నిత్యమూ అవసరమైన పోషక పదార్థాలు భిస్తాయి...వెల 15 పైసలు మాత్రమే.

*ప్రతి ప్రీనేటల్ కేప్స్యూల్ లోనూ బిడ్డ ఆరోగ్యానికీ, తల్లి క్షేమానికీ చాలా అవసరమైన ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు రకాల ఖనిజ పదార్థాలూ వుంటా యని గుర్తుంచుకోండి. వీటివల్ల శరీరానికీ ఎముకలకీ, రక్త నాళాలకీ ఎంతో మేలు కలుగుతుంది; రోగ నిరోధక శక్తి కలుగుతుంది.*

ప్రసవానికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తను గురించి తగిన సలహాలిచ్చే ఉచిత కరపత్రం ప్రతి కావాలంటే సయానమిడ్ ఇండియా లిమిటెడ్, పోస్టు బాక్సు నెం. 195, హైదరాబాద్-1 కి వ్రాసిగాని, మీ మందుల షాపులో గాని తీసుకోవచ్చు.

శుభస్య శీఘ్రం! ఇవాల్టి నుంచే

# ప్రీనేటల్

కేప్స్యూల్

వేసుకోడం ఆరంభించండి. రోజుకు ఒక్కటి చాలు




Lederle లెడర్లి డివిజన్. సయానమిడ్ ఇండియా లిమిటెడ్

CMCP 12 TEL